# విషయ సూచిక

# ప్రకాశకీయం

'కవిరత్న' శ్రీ నీలా జంగయ్యగారికి ప్రస్తుతం ఏ రాజకీయ పార్టీలతోనూ సంబంధంలేదు. తీరిక సమయాల్లో కవితారసజ్ఞులతో- రచనా ప్రసంగ వ్యాసంగాల్లో గడుపుతూ తన ఉద్యోగాన్ని నిర్వహించుకొంటూ కలహకారణాలకు దూరంగా ఉంటూ సంసారపక్షంగా జీవనాన్ని గడపటం వారికి నిత్యకృత్యంగా ఉన్నది.

ఎంత పెద్ద ఉద్యోగమైనా సరే అది స్వతంత్ర ప్రతిపత్తి కలదిగా భావించరు. జీవన ప్రవృత్తుల్లో వ్యవసాయం ఉత్తమమయిందని-మధ్యస్థమయింది వ్యాపారమని కనిష్టమైంది ఉద్యోగంగా చెబుతూ సాగే వీరు సాహిత్యరంగంలో ఎంతో కృషిసల్పారు. బహుముఖాలుగా విస్తరించిన వీరి కవనలక్ష్మి వచన, పద్య, గేయాదుల్లో ముచ్చటైన ఛందోమార్గాల ననుసరించి ఎన్నో గ్రంథాలు వెలయింపచేసింది. ఖండకావ్యం, కావ్యం, నాటకం, కథ, వ్యాసంవంటి రచనా విభాగాల్లో తన ప్రత్యేకతను నిల్పుకొంటూ ముప్పై సంవత్సరాల సాహిత్య గుణ జీవనం చేశారు శ్రీ జంగయ్యగారు.

ఆధునిక సాహిత్య శాస్త్ర విజ్ఞాన జిజ్ఞాసువుల నలరించే వ్యాసాలు 15ను ఎన్నికచేసి కవితారసోదయంపేర మా పబ్లికేషన్ పక్షాన ప్రచురిస్తున్నాం, మా ఉద్దేశం నెరవేరినట్లయితే ఇంక చెప్పేదేముంది- ఆశించిన ఫలం అనుభవించినట్లవుతుంది.

ఈ గ్రంథాన్ని ప్రముఖ విద్యావేత్తలైన శ్రీ చల్లా సోమరాజరాంగారికి అంకితమిచ్చి గౌరవించడం విద్యాజగత్తునే పూజించినట్లుగా

సంభావిస్తున్నాం. గ్రంథకర్తను-స్వీకర్తను ఇద్దరినీ అభినందిస్తున్నాం. విద్యార్థిలోకం ఈ వ్యాసాలను చదివి ఆనందిస్తారని ఆశిస్తున్నాం.

ఈ గ్రంథానికి అభిప్రాయాలు ప్రసాదించిన కళాప్రపూర్ణ ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారికి, రసజ్ఞులు శ్రీయుత ఊట్ల కొండయ్యగారికి మా ప్రత్యేక నమస్కృతు లర్పిస్తున్నాం.

ముఖపత్ర రచన చేసిన శ్రీ అప్పం పాండుగారికి ముద్రించిన మాధవి ఆర్టు ప్రింటర్స్‌వారికి మా ప్రత్యేక ధన్యవాదా లర్పిస్తున్నాం.

హైదరాబాదు
17-7-1983

భవదీయుడు,
ఎన్. శ్రీధర్

# అభినందనము

క. మా జంగయ్య కవీశ్వరు
డీ జగతిన్ స్వీయమధుర హృదయములోనన్
బీజముగ బడసి సుందర
భూజాకృతి నొసగు విశ్వ మోహనరచనన్.

క. సృష్టించున్ బ్రహ్మ, పునః
సృష్టించున్ కవియు నిర్విశేషముగ మహా
ద్రష్టయయి ప్రాణికోటుల
కష్టసుఖమ్ముల నపూర్వకావ్య జగమునన్.

గీ. ఎంత సృష్టి జేసెనేనియు నెంత సొం
పింపు నింపెనేని ఇంతయేని
తనివిలేని తృష్ణ దహియింప జంగయ్య
కవి యొనర్చె నిరత కావ్యసృష్టి.

క. కవితయె అన్నోదకములు
కవితయె ప్రాణంబు ధనము కవితయె బ్రతుకై
కవితా బ్రహ్మమయుడవై
"కవిరత్నా !" వరలినావు కడుధన్యుడవై .

ఉ. ఈ 'కవితారసోదయ' మదెట్టి తపమ్మొనరించెనో మనీ
షాకరుడైన తండ్రి కడుపారగనన్, ధిషణాఽద్వితీయ పు
ణ్యాకృతి కల్గి నాతడు కరాబ్జము బట్టగ; దిట్టలెల్ల నీ
స్వీకృతి జూచి మెత్తురట చెప్పతరంబె తదీయ భాగ్యముల్.

క. నీలా కవివరు కవితా
హేలా లావణ్యమిట్టి హేమాకృతియై
నీలాలు పొదిగికొని ర
మ్యాలోకన భాగ్యమొసగు నాంధ్రావనికిన్.

హైదరాబాదు
19-7-83

— ఊట్ల కొండయ్య

# అంకితం

## శ్రీయుత చల్లా సోమరాజరాం గారికి

శ్రీ విద్యా పదవీ పరి
సేవిత చల్లాన్వయ ప్రసిద్ధ గుణాఢ్యా!
శ్రీవిగ నీ కవితారస
భావోదయ మిచ్చుకొంటి ప్రవిమల భక్తిన్.

సోమరాజాభిదానంద సుధలు విరియ
నలరుమానంతలక్ష్మి మహత్తులంది
జ్ఞానవిద్యా ప్రసూన కంకణము గాగ
స్వర్ణరచితంబు నీ వ్యాస సంపుటి గొని

మీరలు పుత్రకళత్రము
సారసగుణ పద్మలనగ సంసారమునన్
శారద నర్చించుటలో
కోరిన ఫలమంద గోరుకొందు మహేచ్ఛన్.

రచయిత

## జ్ఞానశీలి! విద్యావేత్త!!
## వినయసంపన్నుడు!!!

# శ్రీ చల్లా సోమరాజ రాంగారి
# సంక్షిప్త పరిచయం

"జగమెరిగిన బ్రాహ్మణునకు జంధ్యంబేలా" అనే ఒక పద్య పాదం తెలుగులో సామెతగా చెప్పుకోవడం ఉంది. రతనాలు స్వయం ప్రకాశమైనవే అయినా వాటంతటవి ఊరేగ ప్రయత్నించనట్లే గొప్ప వారు తామెంతటి గుణభాసితులైనప్పటికీ మేం గొప్పవారమని స్వయంగా చెప్పుకోజాలరు. ఒకరిని గూర్చి మరొకరు చెప్పుకొన డానికి వీలుగా వ్యక్తులు రాణించడమే గొప్పతనానికి నిదర్శనము. అట్టి గొప్పను పదుగురిలోకి ప్రవేశపెట్టడానికి కళారంగంలోని క్రియా శీలురు ప్రయత్నిస్తుంటారు. అట్టి సంప్రదాయానికి చేరువగా నేను శ్రీ సోమరాజరాంగారిని గూర్చి పరిచయం చేయాలనుకొన్నాను. వాస్త వంగా శ్రీ రాంగారిని ఈనాటి విద్యావేత్తలకుగాని సంఘ సంస్కర్త లకు గాని ఆంధ్ర కళాపరిషత్తులకుగాని సంఘసేవకులకుగాని పరి చయం చేయవలసిన అవసరం ఒక దృష్టితో లేకపోయినప్పటికీ మరో దృష్టితో చేయవలసిన అవసరం కూడా ఉన్నది. వర్తమానంలో ఆయా రంగాలలో విశేషానుభవాలు విద్యాపరంగ సంపాదించి వాటిని సాంఘిక ప్రయోజనాలకోసం జనానికి పంచిపెట్టి తరించవలెననుకొనే మహాదాదర్శమూర్తుల్ని భవిష్యత్పారకలోకానికి ఎరుకపరచడం ఈనాటి అవసరాలలో ముఖ్యాతిముఖ్యమని సంభావించుకొనడంద్వారా నేనీ పనికి ఉద్యుక్తుడ నయ్యాను.



"కవితారసోదయం" కృతిపతి

శ్రీ చల్లా సోమ రాజరాం గారు వారి ధర్మపత్ని అనంత లక్ష్మి గారు.

పేరు సోమరాజ్‌రాం, ఇంటిపేరు చల్లా, పుట్టినఊరు నల్లగొండ మండలంలోని సూర్యాపేట, జననీజనకులు (ఒకేపేరుగల) కనకమ్మ కనకయ్యలు. జనన సంవత్సరం క్రీ. శ. 1930. సాధించిన విద్యా యోగ్యతలు ఎం. కాం. ఎల్ ఎల్. బి.లు. వివాహం 1951 లో అనంతలక్ష్మి గారితో. ప్రస్తుత నివాసం హార్డికర్ బాగ్, హిమాయత్ నగర్, హైదరాబాద్‌లోని స్వగృహం. సిరిసంపదలు తనకు కలిగిన దానిలో ఇతరులకింత అవసరాన్నిబట్టి పెట్టేటంతగా.

ఈరకంగా లోకంలో ఉన్న వ్యక్తు లెందరికో ఇంచుమించుగా కొంచెం ఎక్కువగానో తక్కువగానో ఇవన్నీ ఉండేఉంటాయి. అవి మాత్రమే వ్యక్తి ఔన్నత్యానికి గుర్తులుగా చెప్పలేముకాని వాటి నాధారంగా చేసుకొని వ్యక్తి స్వయంప్రకాశకత్వంలో అభివ్యక్తమయ్యే అనేకాంశాల విశేషత్వంవల్ల ఆదర్శప్రాయికమైన అంశాలు చరిత్ర కాధారా లవుతాయన్నది సత్యం. అక్షర ప్రసిద్ధులైన గొప్పవారందరికీ వ్యక్తిగత జీవితం ఉండక తప్పదు. ఒక ప్రభువు లోకంలోగల సమస్త గ్రంథాల సారాంశాన్ని ఒకే శ్లోకంలో చెప్పమని ఓ కవిని కోరినాడట. ఆ కవి ప్రభువుతో శ్లోకమంతా ఎందుకండీ! అర్థశ్లోకంలో ఆచరణయోగ్యంగా చెప్పగలనని 'పరోపకారాయ పుణ్యాయ, పాపాయ పరపీడనమ్' అని అర్థశ్లోకంలో చెప్పినాడట. ఈ సూక్తిని అనుసరించి పరపీడనమ్ పాపం, పరోపకారం పుణ్యమని తేలిపోయింది కాబట్టి వ్యక్తి పుణ్యం చేసుకొనవలెనంటే పరోపకారవర్తియై జీవించాలె. అట్లా చేతకానివారంతా పాపాత్ములు మాత్రం కారు. కాని పరపీడన కోరి చేస్తే పాప మంటకతప్పదని ఈ అర్థశ్లోకపాదం హెచ్చరిస్తుంది. కాబట్టి పాపం చేయకుండటం, పుణ్యం వీలైనమేరలో సంపాదించడం అనేదానికి లక్ష్యంగా ఉపకార భావంతో వ్యక్తి జీవించవలెనన్నదే గ్రహిస్తే వ్యక్తిలో స్థిరతను సంతరించుకొన్న అట్టి ఉపకారాంశాలే

ధర్మాలే ఆ వ్యక్తి చరిత్రకు మూలాధారాలవుతాయన్నది సత్యం. అట్లాంటివారే లోకాదర్శనీయులై అలరారుతారు.

'మంచివానికెందు మర్యాద గుణమబ్బు
కొంటెవాని కదియ కోతిబుద్ధి
కర్మ ననుసరించి కనిపించు తన తీరు'

అని ఒకమారో పద్యం చెప్పినాను. ఆ సారాంశానికి దగ్గరగా మానవుడే కావాలె. వ్యక్తిమర్యాదాన్వితుడు. అది లేనివాడు విశేషమానవుడు కాజాలడు. విశేష మానవులనే లోకం ఆదర్శంగా ఎంచుకొంటుంది ఆట్లా ఎంచుకొనడానికి వీలైన వ్యక్తిత్వం మర్యాద పరోపకారత్వం ఉన్న శ్రీ రాజారాంగారిని గూర్చి కొంత సంభావించుకొందాం.

శ్రీయుతులు చల్లా కనకమ్మ కనకయ్యల అనురాగ దాంపత్యంలో ఎనమండుగురు ఆడసంతానం మధ్య ఏకైక పుత్రుడుగా (జనగామ తాలూకాలోని సోమనాథుని ప్రసాదంగా) జన్మించి ఎనలేని అనురాగ సారంలో శ్రీ రాజారాం పెరిగినప్పటికీ తన ఎనిమిదోయేటనే తల్లిలేని వాడయినాడు. అక్కాచెల్లెండ్ర మధ్య ఆణిముత్యంగా వృద్ధిపొందుతూ శ్రీ రాజారాం సూర్యాపేట ప్రభుత్వోన్నత పాఠశాలనుంచి 1948 లో H. C. లో కృతార్థుడయినాడు. ఆనాటి తెలుగు జనం నిజాం నిరంకుశరాచరికంతో నియంతగావర్తించిన ఖాసీంరజ్వీ దుండగీత్వంలో అవతరించిన రజాకార్ల దురాగతాలకు బలిగావడానికి సహించనివారు సోదరాంధ్ర ప్రాంతానికి తెలుగువారు తరలిపోతున్న సమయంలో శ్రీ రాంగారి ఉన్నతవిద్య (ఇంటర్ మీడియెట్) మచిలీపట్టణంలోని హిందూ కాలేజీలో కొనసాగింది. అక్కడి విశ్వవిద్యాలయంలో ఇంటర్మీడి మెట్ పరీక్ష ఫలితాలలో శ్రీ రాం ప్రథమ శ్రేణిలో తీసుకొన్న 4 సబ్జక్టులలో (1950 న) డిస్టింక్షన్‌లో ప్రప్రథముడుగా కృతార్థుడయినాడు. ఎందరి మన్ననలకో పాత్రమైన శ్రీరాంగారి ప్రతిభా స్వరూపం విద్యాపరంగా ఉన్నత స్థాయిలో అభివ్యక్తమయింది. ఇంతలో భారత

స్వాతంత్ర్య స్వేచ్ఛా వాయువులు నైజాం రాష్ట్రానికి ముఖ్యపట్టణమైన హైదరాబాదు నగరానికి వీచినవి. కూకటి వ్రేళ్ళతో పెకలించివేసే రజాకార్ల దురహంకారములతో కొనసాగుతున్న నైజాం ప్రభుత్వం అంతమొందిన విశేషసమయంలోనే శ్రీరాంగారు 1950-51 సంవత్సరం నిజాం కాలేజీలో చేరి బి. కాం. విద్యాధ్యయనం కొనసాగించారు. బి. కాం. ఫైనల్ 1952 లో స్టేట్ ద్వితీయ రాంక్‌లో కృతార్థుడు కావడం విద్యా ప్రగతి జీవనంలో మరో విజయ శిఖరం అధిరోహించిన వారై శ్రీరాం ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం.కాం.లో ప్రవేశించినాడు. విద్యార్థి యూనియన్‌కు ప్రెసిడెంట్‌గా ఎన్నికై తెలివైన విద్యార్థిగా సోదర విద్యార్థుల మన్ననలు పొంది 1953-54 ప్రీవియస్ ఫైనల్ పరీక్షలలో (రెండేండ్లు) ప్రథమ శ్రేణిలో ప్రథములుగా కృతార్థు డయినాడు. విద్యార్థి యూనియన్‌కు ప్రెసిడెంటుగా తన విధులు నిర్వర్తిస్తూ ఎం.కాం. ప్రథమ శ్రేణిలో ప్రథములుగా కృతార్థుడు గావడం విశేషమే అవుతుంది. మంచి విద్యార్థికి సర్వేసర్వత్ర మాన్యత లభించడం-ఆ మార్గంలో వెంటనే ఉస్మానియా విశ్వవిద్యాలయంలో (1954) లెక్చరర్ పదవి (కామర్స్ డిపార్టుమెంట్‌లో) లభించడం తనకబ్బిన విద్యాగంధాన్ని పదుగురికి పంచియిచ్చే అవకాశం కూడా తెచ్చుకొన్న శ్రీరాం బోధకునిగా మంచిపేరు గడించినారు. 1956 లో 'గర్వాల్ రైఫిల్స్ రెజిమెంటల్ సెంటర్ ల్యాన్స్ డౌన్' యు. పి. హిమాలయాలమీద N. C. C. ఆఫీసర్‌గా శ్రీ రాజారాం ట్రైనింగ్ చేసి అటు వైజ్ఞానికంగా-ఇటు శారీరకంగా వికసించి తన ఆచార్యకత్వాన్ని హుందాగా నిర్వహిస్తూనే విరామ సమయాలను ఉపయోగించుకొని LL. B. తరగతులు అటెండయి మొదటి సంవత్సరం ఫస్టు రాంకులోనూ (1958) ఫైనల్‌లో స్టేట్ ప్రథముడుగా ప్రథమ రాంకులో LL. B. పట్టా పుచ్చుకోవడంతో రాం గారు విద్యావిషయ పరిజ్ఞానవంతుడుగా విరాజిల్లినవారైనారు. 1958 నుంచి ఉస్మానియా విశ్వవిద్యాలయ (ప్రాక్టర్‌గా) క్రమశిక్షణ నెలకొల్పే అధికారిగా

నియామకమయి ఆ సమయంలోనే విశ్వవిద్యాలయం ఎంప్లాయీల కోసం స్టోర్సును, విద్యార్థులకోసం కేంటిన్‌లను ఏర్పాటు గావించి వాటి నిర్వహణాధికారం (స్పెషల్ ఆఫీసర్ పదవిని) స్వీకరించి 1959 నుంచి 1963 వరకు చక్కగా నిర్వహించి ఎందరి మన్ననలకో పాత్రుడైన శ్రీ రాజారాం విరామ మెరుగక పరిశ్రమించిన ధన్యజీవి అయినాడు. "విద్యాతురాణాం న సుఖం న నిద్రా" అన్నారు పెద్దలు. ఆ సూక్తి వీరి పట్ల సార్థకమయిందో అన్నట్లుగా 1958 నుంచి 1963 వరకు లా కాలేజీ పార్ట్‌టైమ్ ఈవినింగ్ లెక్చరర్‌గా ఈవినింగ్ లా తరగతులకు బోధించినారు. 1963 లో ఉస్మానియా విశ్వ-విద్యాలయాన్ని వదలి పాలిటెక్నిక్ కామర్స్ డిపార్టుమెంట్ హెడ్‌గా స్థిరోద్యోగులై శ్రీ రాం గారు విద్యాగుణశీల వైభవాన్ని పెంపొందించుకొన్నారు. తా నార్జించిన విజ్ఞానాధికార సంపదలను విద్యావ్యవస్థకే పరిమితం చేయక సాంఘిక విషయాలకు కూడా విస్తరింప చేసినారు.

సూర్యాపేట వేంకటేశ్వర కళాశాల నిర్మాణంలో ముఖ్యపాత్ర వహించడమే గాక, ఆ కళాశాలఫౌండర్‌గా, కరస్పాండెంట్ కార్యదర్శిగా ఉన్నారు.

వనితా మహావిద్యాలయం హైదరాబాద్‌కు కోశాధికారిగా ఎడ్యుకేషన్ సొసైటీ కార్యక్రమాలలో ముఖ్యపాత్ర వహించడమే గాక ఇట్లాంటి సాంఘిక సేవా కార్యక్రమాల నెన్నో చక్కని బాధ్యతలతో నిర్వహించడం శ్రీ రాం గారికి పెట్టింది పేరుగా ప్రశంసించవచ్చును.

కొందరు దేశసేవపేరుతో ఇల్లును మరుస్తారు. ఒడ లెరుగని సిగం బూనడం శ్రీ రాం కు నచ్చని పని. తనకు కలిగిన ఐదుగురు కుమారులను తనంతవాళ్ళుగా దిద్దుకొనడానడానికి చక్కని శ్రద్ధ తీసుకొన్నారు. ఆ కారణంగా తన ఇల్లు విద్యాగంధబంధుర మై గుబాళిస్తుంది.

పెద్దకుమారుడు శేఖర్ జననం 1956 జూలై 17. ఎం. బి. బియస్.తో బాటే ఇ.సి. ఎఫ్. ఎం. జి, పూర్తిచేసి అమెరికాలోని న్యూయార్క్ సిటీలో కోని ఐలెండ్ అనే ఆసుపత్రిలో పని చేస్తున్నారు. అత్యుత్తమ సర్జన్ డాక్టర్ పి. కిషన్‌గారి కనిష్ఠపుత్రిక చి॥ల॥సౌ॥ జయశ్రీ తో 29-11-1981 న మహావైభవంగా వివాహం జరిగింది. సకుటుంబంగా శేఖర్‌గారు అమెరికాలోనే ఉన్నారు.



శ్రీ సోమరాజ్ రాం గారు కుటుంబంతో ఉన్న చిత్రం.

రెండవ కుమారుడు చి॥ కిశోర్‌కుమార్ జననం 15-9-1958. ఎం.బి,బి.ఎస్. మరియు ఇ.సి.ఎఫ్.ఎం.జి. పూర్తిచేసినారు. శ్రీ సరాబు మల్లయ్య ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగారి కనిష్ఠపుత్రిక చి॥ల॥సౌ॥ జలశ్రీ ఎం.ఎస్‌సి. తో 19-12-82 న వైభవంగా కల్యాణం అయింది. వీరు కూడా అన్నగారి అడుగుజాడల్లోనే అమెరికా వెళ్ళినారు.

మూడో అబ్బాయి చి॥ ప్రసన్నకుమార్ జననం 20-8-1960. బి. కాం. ఆనర్స్ డిస్టింక్షన్‌లో కృతార్థుడై వ్యాగ్నర్ కాలేజీ న్యూయార్క్‌లో ఎం. బి. ఎ. ద్వితీయ సంవత్సరంలో చదువుతున్నారు.

నాలుగో అబ్బాయి చి॥ ప్రవీణ్‌కుమార్ జననం 22-8-1960. బి. ఇ. మూడవ సంవత్సరం ప్రభుత్వ కాలేజ్ ఆఫ్ టెక్నాలజీ కోయంబత్తూర్ తమిళనాడులో చదువుతున్నారు.

ఐదో బాబు సంజయకుమార్ జననం 22-6-1964. బి. ఇ. రెండవ సంవత్సరం చదువులో ఉన్నారు.

శ్రీరాంగారి కృషి ఏ రంగంలోనూ తగ్గి లేదని చెప్పడాని కెవరూ వెనకాడరు. ఈరకంగా రాంగారు ఉత్తమ విద్యార్థిగా, విద్యావేత్తగా, ఆచార్యుడుగా, సంఘసేవకునిగా వీటన్నిటికి మించి ఆదర్శ గృహస్థుగా గొప్ప అభ్యుదయం సాధించుట కేదో ఒక శక్తి ఆధారం కావడం తప్పనిదౌతుంది. ఆ దివ్యమైన వెలుగే వారి శ్రీమతి అనంత లక్ష్మిగారు. అన్యోన్యానురాగ దాంపత్యం ఇహాని కాదర్శం. ఇంట గెలిచి రచ్చకెక్కమన్నారు పెద్దలు. సోమనాథానుగ్రహంతో పుట్టి వరలిన శ్రీరాంగారు కన్నవారి కొక్కడై నక్షత్రాలలో మచ్చలేని శశిగా మంగళజీవనం చేస్తూ విధ్యుక్తధర్మాన్ని ఎక్కడా జారవిడువని గుణాభిరాముడై రాణిస్తున్నాడు. చక్కని బంధువర్గం తనచుట్టూ పెట్టని కోటగా ఉండటం ఎంత అదృష్టమో పొగడి చెప్పపనిలేదు.

ఇప్పుడు శ్రీరాంగారొక్కడుకాడు. ఆయనతో ఆర్గురిగా విస్తరించినాడు. ఆయన కేకత్వం పనికిరాదు. బహుత్వంగానే జీవిస్తానంటాడు. ముందు ముందాయన కేం తక్కువ లేదు. ఐదుగురు కోడండ్లు లక్ష్మిదేవతలుగా వచ్చి ఇల్లు నిండితే మనుమలను మనుమరాండ్లను మోసే పనిలో తీరికే లేని అనంతలక్ష్మి రాణారాంల అదృష్టం మూడుపూలారుకాయలేకదా. ఈ దంపతులు పరిశ్రమలోనే విరామం పొందటం నేర్చుకొన్నారు. వైశ్యకులంలో జన్మించి వ్యాపారం ఎరుగక విద్యా యశోభూషణులై యలరారే రాంగారు సంపన్న కుటుంబీకులు కావడంవల్ల వారి సేవలు కులపరంగా కూడా విస్తరించి

ఉన్నాయి. తోచినంతమేర దానధర్మాలు చేయడంలో వెనకాడని రాం గారు హైదరాబాదులోని వాసవీ సేవా కేంద్రానికి ఫౌండర్ మెంబరుగా స్థాపించినప్పటినుంచి నేటిదాక వర్కింగ్ కమిటీ మెంబరుగా ప్రస్తుతం జనరల్ సెక్రటరీగా ఉండటంతోబాటు వాసవీ ఫౌండేషన్ ఎడ్యుకేషనల్ సొసైటీ నెలకొల్పిన డిగ్రీ కాలేజీలో 1973 నుంచి నడుపుతున్న బి. కాం. ఆనర్స్ కోర్స్ ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మేనేజిమెంట్ అండ్ కామర్స్ అనే విద్యా వ్యవస్థకు కార్యదర్శిగా ఉన్నారు. విద్యార్థిగా ఉన్న రోజుల్లో వైశ్య హాస్టల్ విద్యార్థిగా ఉన్న రాం తదభిమానంగా వైశ్య విద్యార్థి వసతి గృహ వర్కింగ్ కమిటీకి మెంబరుగా హాస్టల్ ఆస్తుల్ని కాపాడటానికి ఏర్పడిన ట్రస్ట్ బోర్డుకు కార్యదర్శిగా ఉండి ఉచిత సేవ చేసినారు. ప్రస్తుతం లైఫ్ ట్రస్టీగా ఉన్నారు.

విద్యార్థులను, విద్యావంతులైన కవిపండిత కళాకారులను గౌరవించే కార్యక్రమాలు నిర్వహించేవారిని మిక్కిలి గౌరవించే దాతృత్వాన్ని ప్రదర్శించడమేకాక ఆఫీషియల్ కెపాసిటీలో సమున్నత ప్రతిభామూర్తిగా శ్రీరాంగారు దర్శనమిస్తారు

1. కమలా నెహ్రూ పాలిటెక్నిక్ ప్రిన్సిపాలుగా ఉన్నారు.

2. జాబ్ ఓరియంటేషన్ కోర్సుకోసం సిలబస్‌లో మార్పులు తేవడానికి స్టేట్ గవర్నమెంట్ ఏర్పరచిన హై పవర్ కమిటీ మెంబరుగా ఉండిరి.

3. ఆంధ్రప్రదేశ్ ఒకేషనల్ కోర్సెస్‌లోని పనితీరును పరిశీలించి తగు రిపోర్టును అందజేయడానికి రూపొందించిన హై పవర్ కమిటీకి మెంబరుగా ఉండిరి.

4. వాసవీ కో-ఆపరేటివ్ అర్బన్ బేంక్ లిమిటెడ్ డైరెక్టరుగా ఉన్నారు.

వృత్తి సంబంధంగా సిలబస్‌ను రూపొందించడంలో ఒకేషన లైజేషన్ ఆఫ్ ఇంటర్మీడియట్ కోర్స్ పునర్నిర్మాణం కాపర్స్ సబ్జక్టుకు కమిటీ మెంబరుగా ఉన్న శ్రీ రాజారాం ప్రసన్నంగా ప్రశాంతంగా తమ విధులు నిర్వహిస్తూ ఎప్పుడూ కూల్‌గా ఆలోచిస్తారు. కారును స్వయంగాకూడా డ్రైవ్ చేసుకుంటారు. సోమనాథదేవుని నామం కలిసివచ్చేలా సోమశబ్దము, వైష్ణవ సంప్రదాయంగా వీరింటి ఆచారాని కనుబంధంగా రామశబ్దము, వారి తాతగారి పేరు కలిసి రావడానికి వీలుగా రాజశబ్దము కలిసి శ్రీ సోమరాజ్‌రాంగా విద్యామూర్తిమత్వంతో భాసిస్తున్నారు. అందుకే ఈ నా వ్యాససంపుటి శ్రీరాంగారికి అంకితంగా ఇస్తున్నాను. అంతర్జాతీయఖ్యాతి గడించిన కామరాజ్‌నాడార్ గారు పుట్టిన విరుధ్‌నగర్‌లో వెలసిన పాలిటెక్నిక్ బోర్డు ఆఫ్ గవర్నర్స్‌లో భారత ప్రభుత్వ విద్యా ప్రతినిధిగా 6 సంవత్సరాలు శ్రీరాం గారున్నారు. విద్యావంతులకు విశ్వమే ఒక ఇల్లు. ఆశ్చర్యపడవలసిన పనిలేదు. నిత్యసంపన్నులైన విద్యావంతులను ప్రపంచం గౌరవిస్తుంది. సారమతులై సత్కవీంద్రుల ప్రస్తుతి వహిస్తారు. రూపయౌవన సంపన్నాలు వృద్ధిక్షయాలు గలవి. నిత్య హరిత యౌవనంతో ఆజన్మాంతం వ్యక్తినంటి భాసించే విద్యాజ్ఞానం క్షతి లేనిది.

ఈ నా కవితారసోదయాన్ని గ్రహించి శ్రీ రాంగారు దిన దిన ప్రవర్ధమానులై మానవ కల్యాణానికి ఎనలేని సేవలు చేస్తూ పచ్చ పచ్చగా శోభిల్లాలని ఆశిస్తూ భగవానుణ్ణి ప్రార్థిస్తూ విరమిస్తున్నాను.

—o—

# భారత కల్పవృక్షం
# వసుమతీవసంతం

నన్నయభట్టు విరచితమైన తెలుగుభారతం ఆంధ్ర రమకు మణిమకుటప్రాయమైనదిగా చెప్పుకోవడం సముచితమే. తొలి తెనుగు కావ్యంగా దీనికున్న బలంతో సరితూగే కావ్యం నన్నెచోడుని కుమారసంభవం అని విమర్శకులు భావిస్తారు. అవిరళ సరళ సంస్కృత పదగుంఫితమైన వృత్త సమూహాలతో దేశీయమైన జాతి కంద- సీస-గీత-ఆటవెలది వంటి పద్యసంతతులతో ఉపజాతి ఛందశ్శిల్ప శోభితమై తెనుగుభారత మలరారె ననుట నిర్వివాదాంశము.

"వసుమతీ వనితావిభూషణమై వేంగినాడుకు నాయకరత్నమై సకల భువన లక్ష్మీ నివాసంగా రాజమహేంద్ర" మున్నట్లుగా వర్ణించినాడు నన్నయ.

"విష్ణువర్థన విరాజితుడైన రాజరాజనరేంద్రుడు రాజమహేంద్రాన్ని పాలిస్తున్నాడు. తన రాజసభలో అపార శబ్ద శాస్త్రపారగులైన వైయాకరణులు, భారత రామాయణానేక పురాణప్రవీణ పౌరాణికులు, మృదు మధుర రస భావ భాసుర నానార్థ వచనరచనా విశారదులైన కవులు, వివిధ తర్కవిగాహిత సమస్త శాస్త్ర సాగర గరీయః ప్రతిభులయిన తార్కికులు పరివేష్టితులై ఉన్న సమయంలో ఒక్కనాడు నన్నయభట్టును చూసి -

"భూదేవకులాభితర్పణము - మహీయః ప్రీతియు, భారత శ్రవణాసక్తియు, శివపదాబ్జ ధ్యాన పూజా మహోత్సవము, సాధు సాంగత్యము ఎల్లపుడూ ఇష్టంగా ఉండే ఆ రాజరాజనరేంద్రుడు ఆశ్రితపోష

కుడుగా. వసంత విలాసుడుగా, మనీషి (గుణాత్మ విద్యాశ్రమ తత్త్వవేత్తుడు) గా, సమస్త వర్ణాశ్రమ ధర్మరక్షకుడుగా, సర్వలోకాశ్రయు డయిన ఆదిరాజనిభుడుగా మహా మహిమతో ఒప్పు"చున్నట్లు నన్నయచే కీర్తింపబడినాడు.

"తన మహిమండల ప్రజలను ప్రీతితో పోషిస్తూ, పరమండల ధరణీపతులను అదిమిపెట్టి కప్పములను సంతోషంతో స్వీకరిస్తూ ఎదురించే భూపతుల సుక్కడగిస్తూ తన ఆజ్ఞల్ని దశదిశల ప్రాకేటట్లు చూస్తూ, బ్రాహ్మణులను పోషిస్తూ, భీతులు శరణన్నచో రక్షిస్తూ, అగ్రకులాలవారికి అనుగ్రహంతో చారుతరమైన మహాగ్రహారాలిస్తూ (దండలు) దేవభోగాల మహావిభవాన్ని తలపింపజేస్తూ ఉన్నా" డని నన్నయ వర్ణించినాడు.

ఆ తరవాత తనసుగూర్చి నన్నయభట్టు రాజరాజ నరేంద్రుడు ఇట్లా అన్నట్లుగా చెప్పుతొన్నాడు.

"కులబ్రాహ్మణుడు, అనురక్తుడు. అవిరళ జప హోమతత్పరుడు, విపుల శబ్దశాసనుడు, సంహితాభ్యాసుడు, బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞానవిరతుడు, సద్విసుతావదాతచరితుడు, లోకజ్ఞుడు, ఉభయ భాషా కావ్య నిర్మాణ శోభితుడు, సత్ప్రతిభాభియోగ్యుడు, నిత్య సత్య వచనుడు అయిన నన్నయభట్టును తెనుగులో ఆదికవిగా మనం ఆరాధిస్తున్నాం. పై విశేషణా లన్నీ తానే చెప్పుకొన్నాడు నన్నయ. ఇది ఇట్లా ఉండగా, రాజరాజనరేంద్రుడు నన్నయతో - అనేకము లయిన పురాణాలు విన్నాను. అర్థధర్మశాస్త్రాలను తెలుసుకొన్నాను. ఉదాత్త నాటక క్రమాలను చూసినాను. జగత్పరిపూజ్య మైన ఈశ్వరాగమాలలో హృదయాన్ని నిల్పినాను. భక్తివి అలవరచుకొన్నాను. అయినా భారతము మీద నా ఆసక్తి గొప్పదై ఉన్నది" అస్మదీయ వంశంలో ప్రసిద్ధులై, విమల సద్గుణశోభితు లయిన పాండవోత్తముల చరిత్రము-

ఎప్పుడూ వినవలెననే అభీష్టం ఉన్నవాణ్ణని, అదే కాక ఆ చరిత్ర విన్నందువల్ల కలిగే ఫలాన్నికూడా ఇట్లు చెప్పినాడు.

పవిత్రమైన బంగరుకప్పెల్ని తొడిగిన కొమ్ములు గల నూరు తెల్లావుల్ని దానం చేస్తే కలిగే ఫలంతో సమన్వయించి తెనుగులో భారతాన్ని వ్రాయమన్నాడు.

ఏ భాషలోనైనా, ఏ ప్రక్రియలోనైనా, ఎవరితో గానీ భారత కథ విన్నవారికి సమస్త యాగఫలం లభిస్తుం దని రచనారంభానికి పూర్వమే కావ్యఫలశ్రుతిని నన్నయభట్టు ప్రకటించినాడు.

రాజరాజ నరేంద్రుని కోరిక ననుసరించి భారతరచనకు పూను కొన్న నన్నయ భారతాన్ని ఇట్లు వర్ణించినాడు. ‘‘నిర్మలిన తారకల్ని గణించడంవంటిదే కాక భారత భారతీ సముద్రాన్ని ఈది దరి జేరడం వంటి దని, బ్రహ్మకు సైతం అలవిగాని సర్వ వేదశాస్త్ర సారంగా పోల్చి విద్వజ్జనానుగ్రహంతో నా నేర్చిన కొలది ని అభిమతాన్ని (తెనుగు) చేస్తా’’ నన్నాడు.

హరి, హర, అజ, గజాననునే గాక అర్కున్, షడాస్యున్, మాతృ సరస్వతిని, గిరిసుతాది దేవతాపతికినీ నమస్కృతులు చేసిన నన్నయ గురుపద్యవిద్యకు ఆద్యుడైనవానిగా, దుర్భర తపోవిభ వాధికుడైనవానిగా, బ్రహ్మసమాను డయినవానిగా ప్రచేతసు పుత్రు డగు వాల్మీకిని (ఆదికవి యని) భక్తితో మొదట నుతించి భారత భారతీ కాంతికిరణంతో ఘోరమయిన సంసార వికారాంధాన్ని తొల గించినట్టి భూరి యశోవిరాజితు డైన పరాశరాత్మజుణ్ణి (వ్యాసుణ్ణి) రెండవవానిగా కొల్చినాడు. తనతో రాజసభలో ఉన్న సమస్త బుధా వళిని ప్రశంసించిన తరవాత భారతయుద్ధంలో అర్జునునకు కృష్ణుడు తోడ్పడినట్లే వాఙ్మయధురంధరు డయిన నారాయణభట్టును తనకు సహాధ్యాయుడుగా, స్నేహితుడుగా సంభావించి భారత రచనలో

తోడ్పడినట్లు చెప్పుకొన్నాడు. రచన చేసిన తరవాత నారాయణభట్టును ప్రస్తావించే ఈ పద్యం వ్రాసి ఉంటాడని భావించ వీలున్నది.

తన భారతరచనలో అందరి రచనలలో ఉన్న ప్రధానమగు రెండు గుణాలకంటే మరో గుణం అతిశయంగా ఉందని ఆ గుణం నానా రుచిరార్థసూక్తినిధిత్వంగా చెప్పడం అయింది.

"సారమతిం గవీంద్రులు ప్ర
సన్న కథాకలి(వి)తార్థ యుక్తిలో
నారసి మేలు నాన్ ఇతరులు—
అక్షర రమ్యత ఆదరింప, నా
నా రుచిరార్థసూక్తి నిధి —
నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితా రచన
బంధురు డయ్యె జగద్ధితంబుగన్."

తెనుగున రచియింపుమన్న కందం కన్నా ఈ పద్యంలో ప్రాస స్థానంలో వాడక, ఈ పదం తెనుంగునన్, అనడంతో ఆనాడు భాషాపరంగా ఆంధ్రభాషకు తెనుగు అనే వాడకం ఉన్నట్లు ద్యోతకం అవుతుంది.

భారతాన్ని తెనుగులో రచించడం కోసం నన్నయ చేపట్టిన విధానం సూచనప్రాయంగా సమాలోచింతాం.

మ గణ ప్రయోగం గ్రంథాదిగా ఉంచే సర్వ శుభోత్కారం, యశస్కారం అని ఛందశ్శాస్త్రం చెబుతుంది.

"శ్రీ వాణీ గిరిజాశ్చిరాయ......... శ్రేయసే" అనే భారత గ్రంథాది పద్యం శార్దూలవృత్త మైంది. ఈ వృత్తం మగణ మాదిగా గలది. ఏ పనికైనా శ్రీకారం చుట్టడం శుభ లాంఛనంగా ఆంధ్రులు విశ్వసిస్తారు. శ్రీకారం కూడా ఈ శార్దూల వృత్తంలో ఆద్యక్షరమై

ఒప్పినది. దీనిలో మూర్తి త్రయాన్ని, లక్ష్మి, పార్వతీ, సరస్వతీమ తల్లులను, వేదాలను ముమ్మారు అభినుతించినట్లు కూడా అయింది. త్రిగుణాత్మకమైన సృష్టిధర్మాన్ని ఆరాధించే మనస్సు నన్నయది. ఈ పద్యంలో ఛందశ్శాస్త్రాన్ని-సంప్రదాయాన్ని- దైవభక్తిని-జననీ జనకుల్ని (స్త్రీ పురుషుల్ని) త్రిగుణాత్మక ప్రకృతిని కొలిచిన నన్నయ అందుకే తన కవిత్వాన్ని మూడు గుణాలతో పోల్చుకున్నాడు.

రాజరాజ నరేంద్రునితో బాటు రాజమహేంద్రాన్ని వర్ణించి తననుగూర్చి కొంత చెప్పుకొని భారతప్రశస్తిని సముద్రాన్ని ఈది దరిజేరడం వంటి కష్టంతో పోల్చి తత్కథాప్రశస్తికి సంబంధించిన ఫలశ్రుతిని చెప్పి ప్రభువు అభిమతాన్ని పాలనకు సంబంధించిందే కాక సాహిత్యానుబంధంగా గుణాత్మకంగా చెప్పి రచనోద్దేశం ఈ రకంగా నన్నయ తన కవిత్వంలోని త్రిగుణాలను ముఖ్యంగా ప్రశంసించి కొన్నాడు.

(1) ప్రసన్నకథాకలి(వి)తార్థయుక్తి

(2) అక్షర రమ్యత.........లే కాక మూడవదగు

(3) నానారుచిరార్థసూక్తి నిధియై

మహాభారత సంహితా రచనబంధురుడుగా విశ్లేషించుకొన్నాడు. నన్నయ, తన కాలంవరకు గల కవులంతా పై రెండు ముఖ్యగుణాలనే ఆదరిస్తూ రచనలు చేసినట్లు భావించి తనదైన నూతనగుణం "నానా రుచిరార్థసూక్తినిధిత్వాన్ని" ప్రత్యేకించి ప్రశంస చేసినాడు.

"ఉభయ భాషా కావ్య రచనాశోభితుడు"గా ప్రకటించు కొని నాడు. 1 వది తెలుగు; 2 వది బహుశా సంస్కృతమే కావచ్చును.

తెనుగులో ఆంధ్రీకరించిన భారతము ఒకటిగా, సంస్కృతంలో రచించిన ఆంధ్రశబ్ద చింతామణి రెండుగా ఉభయభాషాకావ్యరచనా శోభి

తత్త్వానికి గీటురాళ్లుగా చెప్పుకోవచ్చును. "కావ్య"మనడంలో సంస్కృతంలో మరేదైన కావ్యం వ్రాసినాడేమో తెలియదు.

మొత్తానికి సంస్కృతాంధ్ర కావ్య మరియాదలన్నీ గుణాత్మకంగా, గొప్పగా తెలిసినవానిగా నన్నయభట్టును నిర్ణయించుకోవచ్చును. లేనిచో భారతాంధ్రీకరణం సాగేదే కాదు.

నన్నయనాటికే తెనుగుభాష కావ్యరచన కుపయోగంగా ఎదిగిందనేది నిర్వివాదాంశము. " తెనుగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్"అని రాజరాజనరేంద్రుడు పలికిన వాక్యమే సాక్షి. అట్లుగా నమువదించిన నన్నయ తెలుగుభారతమే సాక్షి. ఈ విధంగా సరిపెట్టుకోవచ్చును. నన్నయ సమకాలీన కవు లెందరో - ఎట్లుండిరో - ఏమి వ్రాసిరో ఊహ కందని స్థితిని ఎట్లు చెప్పినా ఒప్పిద మనిపించుకోదు. ఏ భాష కాని కావ్యరచనకు సరిపోయేరీతిగా ఎదగడం అంటే ఆ భాషీయుల అదృష్టమనే భావించాలె. ఆ భాష అజరామరత్వం గలదిగా చాటుకోవాలె. కావ్యమరియాదలో బ్రతికి బట్టగట్టిన ప్రతి భాష జీవద్భాష అవుతుంది. అందుకే తెలుగుభాష జీర్ణావయవం చాలా శక్తివంత మైనదిగా కొనియాడబడింది. భాష విస్తరించడం అంటే ఆ భాషలో మహనీయులు పుట్టినా రనేమాట అన్యథా చెప్ప పని లేదు. సృష్టి ఏదైనా మహాత్ముల పోషణలోనే అమరమై విస్తరిస్తుంది. తెనుగు భాషను నన్నయాదు లెందరో పోషించినారు. అందుకే ఈ తెనుగు జీవద్భాషలలో పరిపూర్ణ మైనదిగా నిలదొక్కు కొన్నది. నన్నయనాటికి ఇప్పుడున్న తెలుగు, "తెనుగు"గానే ఖ్యాతి పొందినది.

చళుక్యమన్మథు డైన రాజరాజనరేంద్రునికి వాడిన రెండు విశేషణాలు కొనియాడదగినవి. ఒకటి: రాజకులైకభూషణుడు. రెండోది రాజమనోహరుడు - చాలు. ఒక కవినీ, భాషనూ పోషించినవాడే చక్రవర్తి తుల్యుడు. "సుకవితాయద్యస్తి రాజ్యేన కిం?" మంచి కవిత్వం

చెంత సుంచుకొన్నవానికి రాజ్యమెందుకు ? ఉన్నా, లేకున్నా ఒక్కటే నని అర్థము.

భారతకథా ప్రస్తావనలో ! వివిధ వేదతత్త్వవేది వేదవ్యాసుణ్ణి విష్ణుసన్నిభుడిగా చెప్పి విశ్వజనీనంగా భారతాన్ని "సంస్కృతం"లో వ్రాసెనని చెప్పినాడు. వ్యాసప్రోక్త ప్రతినే అనుసరించి తెనుగు భారతాన్ని నన్నయ వ్రాసినాడు. ఈ విషయాన్ని పర్వానుక్రమణికలో ఏ ఏ పర్వంలో ఎన్నెన్ని శ్లోకములు కలవో వివరిస్తూ తెలుగుపద్యాలు వ్రాసినాడు నన్నయ. అదేకాక ఆ యా పర్వాలలో వచ్చే విషయాలను కూడా వివరించినాడు. ఆ ప్రతి ఇప్పుడు లభ్యం కాకుండా పోయి ఉండవచ్చును.

కాలం సత్యాన్ని మిగిలిస్తుందని యోగుల జ్ఞానుల నమ్మకం. ఉత్తరోత్తర కాలానికి సరిపడే అంతవరకే జ్ఞానం మిగులుతుంది. ఆ పని ప్రకృతి నిర్వహిస్తుంది. అట్లా సరిపెట్టుకోకపోతే సృష్టి యావత్తూ శాశ్వతమైతే వర్తమానమే ప్రదీప్తం కాకుండా పోతుంది. భవిష్యత్తు శూన్యమవుతుంది. నన్నయ భారతంలో ఆ కాలంలోవి తెలుగుపదాలను శాసనపరమైనవి, లేఖనపరమైనవి, రచనాపరమైనవి, ప్రసిద్ధమైనవి మాత్రమే గ్రహించినాడు. లోకోక్తులు-సామెతలు-నుడికారాలు వంటివి ప్రసిద్ధాలయినవే రచన కుపయోగించినాడు. తత్సమాలు-తద్భవాలు-ధాతుజాలు అధికంగా ప్రయోగించి సంప్రదాయబద్ధంగా భారతాన్ని నిబద్ధించినాడని చెప్పవచ్చును.

దేశీయమైన ఛందస్సును భారతరచన కుపయోగించినాడు. ఆనాటి ఆంధ్రు లనుసరించిన జైన. బౌద్ధ విజ్ఞానంలో తెలుగుతత్త్వం భాషాపరంగా, శాస్త్రపరంగా (విషయగతంగా) విస్తరించి ఉన్నదాని నుంచే ఎన్నుకొన్న తీరులు రచనలో చోటు సంపాదించినవి. తేటగీతి, ఆటవెలది, మధ్యాక్కర, తరువోజ, కంద, సీసాదులు ఆధారాలయి

నవి. అక్షర వశంకాని భాష అనేక పదరూపాలలో జనంలో జీవిస్తూ సాగుతుంది. వాగ్వ్యవహారమైన భాషను అక్షరగతం చేస్తాం. అక్షరస్థమైన భాషను వ్యవహారంలోకి తెచ్చుకుంటాం - ఇదీ సంగతి.

భారత రచనకు పూర్వమే మల్లియ రేచని ఛందోగ్రంథము (తెలుగులో) కవిజనాశ్రయ ముంది. కవిజనాశ్రయంలోకి ఎక్కని జానపద బాణీ లెన్ని ఉండెనో ఊహించజాలము. మనకు దక్కిన లక్ష్యగ్రంథము నన్నయ తెనుగు భారతము, లక్షణగ్రంథము కవిజనాశ్రయముగా కాలంలో నిలిచిన తెలుగువారి మూలధనమై శోభించినవి. కవిజనాశ్రయంలోని ఛందస్సును నన్నయ భారతరచన కుపయోగించె నని చెప్పడం ఉంది.

కొండలు కొండలుగా కుప్పలు కుప్పలుగా లేదా రాసులు రాసులుగా వేంగీ రాజ్య మండలాలలో అప్పటి వివిధ తెలుగు మండలాలలో ఎదిగిన తెలుగును పలుకు టద్దాలు చిత్రాలు తీయకపోలేదు. గతం అనేది వర్తమానంలో మిగిలే గుర్తుగాను ఆ గుర్తు భవిష్యత్తును ఆహ్వానించేదిగాను ఉంటుంది. ఈనాటికీ తెనుగు భాషలో ఉన్న జానపద బాణీలు ఛందోలక్షణాలకు సరిపడేవి ఎన్నో కీర్తనలు, పాటలు, పదాలు, జావళులు ఉన్నాయి.

మూగచెరనుంచి విడివడిన మనిషి లయగా ఏడ్చినాడు. ఏడుపులో నవ్వులో (ఆనందంలో) లయనే అనుసరించినాడు. లయలో పుట్టిందే అక్షరము. అదే అ ఆ ఇ ఈ లంగూడి క ఖ గ ఘ లతో పదభాసితమై వాక్యమై వాఙ్మయాన్ని అనేక రూపాలలో చిత్రించింది. అందులో వాఙ్మయ దర్శనం చేస్తున్నాం. ప్రజలు వాడే భాష మొత్తం అక్షరస్థం కాజాలదు. అది జనం వాడకంలోనే జీవిస్తుంది. అది లయతో కొనసాగుతుంది. కాలంలో ఈ లయ చెప్ప వీలుగాని విశేషం.

భావలయ, పదలయ, ఛందోలయలతో కూడినదే కవిత్వం. తత్త్వరతులకు రాగద్వేషాలుండవు నిత్యానిత్యాలమధ్య సృష్టిధర్మం కొనసాగుతుంది. రక్తివిరక్తుల్లో జ్ఞానం ప్రకాశించడం తప్పనిదయి పోతుంది. వ్యక్తి వ్యక్తికీ ఒక శైలి అనుసరించిన రచననుబట్టి రూపొందుతుంది. నన్నయ శైలి ఒకరీతిలో ప్రత్యేకించి భారత రచన చాటి చెబుతుంది.

నానారకాల కందాలు-సీసాలు-మధ్యాక్కరలు ఆదిసభాపర్వాలలో చూడగలం. భారతం కథా ప్రక్రియగా చెప్పబడినదే. అందుకే నన్నయ "భారత కథాశ్రవణ ప్రవణంబ" అని వాకొన్నాడు.

విస్తరించిన సృష్టిధర్మంలో దేనికేది మూలమో ఖచ్చితంగా గుర్తించి చెప్పడం కష్టమే అవుతుంది. పరిణామాల రూపభేదాలలో ప్రతివస్తువుకూ మూలమొకటి ఉండకతప్పదు. సమస్త భాషలకు మూలము ప్రకృతి. ప్రకృతి సంశ్లేష విశ్లేషణలే భాష కాధారం.

నన్నయను కొలువని తెలుగుకవి లేడని చెప్పవచ్చును. ఆదికవి నన్నయనే అని చెప్పడానికి ప్రబలమైన సాక్ష్యం ప్రతి తెలుగుకవి, ఆయన తరవాతివారందరూ ఆయనను సంస్తుతించినారు. నన్నెచోడున్ని చాలామంది గ్రంథాదుల్లో స్తుతి సల్పలేదు. అనుశ్రుతంగా వస్తున్న మహాకవుల తెలుగు గ్రంథాలు పరిశీలిస్తే ఈ సంగతి సువ్యక్తమవుతుంది. ఈ ఆధారంతో ఇంతవర కెవరూ నన్నయ ఆదికవి అని చెప్పలేదు. ఇది నా ఊహ మాత్రమే.

తెలుగులో భాగవతాఖ్య కల్పతరువు-సద్విజశ్రేయంగా అవతరించడానికి ముందే తెనుగున మహాభారత పారిజాతము ధాత్రీసురప్రార్థ్యమై అమరింది. ఈ మహాకావ్యాలు రెండూ ఈనాటి మహాకవులైన విశ్వనాథ సత్యనారాయణ రామాయణ కల్పవృక్షానికి ఆదర్శమై కల్పలతా పవిత్రంగా తెలుగు సాహిత్య జగతి అజరామరమయింది.

"సర్వేజనా స్సుఖినో భవన్తు"

(2)

—o—

# గురుప్రతీక విద్యాగంధం

గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుదేవో మహేశ్వరః
గురు స్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః॥

పరబ్రహ్మం—గురుప్రతీకతో చాటబడినది. వేదోపనిషత్తులు-అష్టాదశ పురాణాలు, ఉపపురాణాలు, అచలాది యోగాలు, సమస్త విద్యలు గురుప్రమాణంగా-ప్రధానంగా గురువువలన సాధించబడినవే-తెలియదగినవే-విద్యలుగా భారతీయులు భావిస్తారు.

చీకటినుంచి కాంతిలోకి - అజ్ఞానంనుంచి జ్ఞానంలోకి—అవ్యక్తం నుంచి వ్యక్తంలోకి సూక్ష్మంనుంచి స్థూలంలోకి ప్రయాణించడానికి చేయు ప్రయత్నమే విద్య. ప్రస్తుతం మనం నేరుస్తున్న విద్య లివి కావు.

ఈనాడు-ధనార్జన కుపయుక్తమైనవి, వృత్తిమూలకమైనవే విద్యలుగా గుర్తించబడుతున్నాయి.

ఆ కళల్లో-అనంత శాస్త్రాలు, కామాలలో చెప్పరానన్ని కళలు వ్యాప్తమైన ప్రపంచంలో ఏది విద్య-ఏది సత్యం-ఏ దవిద్య? వంటి ప్రశ్నలనుంచి మానవుడు విడివడలేకపోతున్నాడు. భారతీయ సంప్రదాయ విద్య క్షీణిస్తుంది. ఆత్మదర్శనం-పరహితాన్ని చాటే విద్యలు మూలబడి చిత్తాన్ని వికలపరచే-పరుల్ని హింసపెట్టే నిస్తేజమైన కుటిల విద్యలు మానవజీవుల్లో ప్రవేశించి పరస్పర హననక్రియకు హేతుబద్ధమైన దుష్టవిద్యలు ప్రచారంలో కొనసాగుతున్నాయి.

సంతానంమీద ప్రేమలేని దయలేని జననీ జనకత్వం, జననీ జనకుల సేవించ వీలుగాని సంతానం, సమాజాభ్యుదయం ప్రవర్తనలో చూపలేని అస్థిర పరిపాలనం ఒకటేమిటి ఎన్నో భయానకమైన

తంత్రాలు—మోసాలు—పన్నాగాలు నరుల నైర్మల్యం వైపు నడిపించ జాలని అలీన మత వైషమ్యాలు, ఆచారాలు-భాషావిభేదాలు—కులాలు-ప్రాంతాలు బలం పుంజుకొని ఇష్టారాజ్యం చేస్తున్నాయి.

దుష్ట విక్రియల దండించి శిష్ట సత్వాన్ని పరిపోషించి ధర్మాన్ని వ్యవస్థాపరంగా స్థాపించి ప్రచారం చేయడానికి వీలైనవే విద్యలుగా భారతీయులు భావించేవారు ఒకనాడు. ఈనాడు పశుపోషణ విద్యలు, అనగా గొర్రెల, కోళ్ళ, బర్రెల, పందుల పెంపకాల గురిం చిన విద్యలు పోషణలకు సంబంధించిన విద్యలు నేరుస్తున్నారు. అవి శాస్త్రీలుగా వ్యాప్తిలోకి వచ్చినాయి. అవసరాలు-పనులవైపు నడి పిస్తాయి. ఈనాటి జనబాహుళ్యంలో ఆకళ్లు, అడియాసలు అధిక మైనవై తృప్తి సంకేతం సిగ్గున తలవంచింది. అక్షరమూలకమైన తర్క సందేహ విద్యలే వివృతమైనవికాని సాక్షాత్కారగుణాత్మక దార్శనిక భావవిద్యలు సదాలోచనాత్మకములైనవి సమసిపోతున్నాయి. కాలపరిస్థితుల ప్రభావాలు వ్యక్తుల నాశ్రయించి జీవిస్తుంటాయి. సద్గురుస్మరణ లేని విద్యలు వృద్ధికావు.

ధర్మంపేరుతో అధర్మం, మంచి పేరుతో వంచన విద్య పేరుతో అవిద్య ననుభవించే సమాజానికి మంచి రాజ్యముండనట్లే జ్ఞాన విద్యల పేర అజ్ఞాన భాసితాలైన అవిద్యలు ప్రచారంలో నిలదొక్కుకుంటాయి. సత్యసంపూజ్యమైన మానవీయ మానవాత్మక ధర్మానుష్ఠాన నిగమైక విద్యా సంపన్నాలు-ఆ మానవ సంఘానికి కరువుగాక పెరిగే పరిస్థితు లేవి ?

తర్కం చదివినవాడు-సత్యాన్ని ఆవిష్కరించాలెగాని జీవనం కోసం అసత్యాన్ని బలపరుస్తున్నారు. బ్రతుకుజీవుడా! అన్న ప్రబోధ మొక్కటే ఇప్పటి విద్యారంగాన్ని ఆవరించి గుర్తింపు పొందిన దయింది. నీతిబాహిరాలైన హేతులక్షణాలు జాతి జీవనంలో వేళ్ళూ వింది.

తూర్పున సూర్యు డుదయించి పడమట అస్తమించును అంటే ఖగోళశాస్త్ర మవుతుంది. ఆవుకు నాలుగు కాళ్ళు ఉంటాయి అంటే జంతుశాస్త్ర మవుతుంది. ఇట్లా బోధించబడే విద్యలు నేర్వడానికి వచ్చిన విద్యార్థులకు భౌతిక విద్యనే అలవడుతుంది. కాని ఆధ్యాత్మిక జ్ఞానం చిక్కదు. చింతకాయ బొమ్మను చూపించగలమేగాని పులుపు గుణం చూపించగలమా? అనుభవిస్తేనేగాని అంతుబట్టని ఆధ్యాత్మిక విద్యలు భారతీయులు గుణాత్మకవిద్యలుగా భావించేవారు. మతజీవనం_ ఘటశోధనం, ఋషిజన, మునిజన సంప్రదాయంగా ప్రభావితమైన భారతదేశంలో ఈనాడు మంచి పాఠశాల అంటే సుందరమైన భవనం- మంచి విద్యార్థి అంటే దేహాద్యలంకారంలో తీర్చి దిద్దబడటం, బూటు- సూటు వంటివి, ధర గలవి - ఇవే నేటి విద్యారంగాన్ని పరిపుష్టం చేస్తున్నాయి. అట్లని ఆధునిక విజ్ఞానాన్ని విమర్శించటంలేదు. ఆధునిక శాస్త్ర విజ్ఞానం అనేక విషయాలలో వినూత్న ప్రయోగాలతో వెలుగు లోకి వచ్చింది. మానవులు వారివారి భాషల్లోకి శాస్త్ర విజ్ఞానాన్ని పరి వర్తనం చేసుకొంటూ తరతరాల విద్యార్థి జనానికి బోధనాధ్యయనాల కుపయుక్తంగా పరిశోధనలకు వీలుగా సుసంపన్నం చేస్తూవస్తున్నారు.

అనంతకాలంగా మరుగుపడక వస్తున్న వేదాలు - పురాణాలు- ఉపనిషత్తులు-జ్యోతిషశాస్త్రాలు - దర్శనాది యోగశాస్త్రాలెన్నో మన ముందున్నాయి. ముఖ్యంగా పంచభూత ప్రకృతి అజరామరంగా మార్పు స్వభావంతో మన ముందున్నది.

విజ్ఞానం- ప్రకృతి - జీవుడు శాశ్వతతత్త్వాన్ని కలిగి ఉన్నాడు. ప్రపంచంలో విస్తరించి ఉన్న విజ్ఞానానికి - జీవవికాసానికి ఆధారం ప్రకృతి. మూలప్రకృతి సమస్త విషయాలకు ఆధారమైన సంగతి గ్రహిస్తే పాత కొత్తను సృష్టిస్తుంది. కొత్త పాతబడుతుంది.

"చదువనగా - అచ్యుతుని జాడా కనుగొనుట.
ఎల్లపుడూ - సత్యమునూ నోటనుట"

తద్భిన్నమైన విద్యలన్నీ తిండికి సుమ్మా అని చెప్పబడి ఉంది. గ్రహించే తీరునుబట్టి సాక్షాత్కారం ఉంటుంది.

పోతనకవీంద్రుడు వ్రాసిన భాగవతంలో ప్రహ్లాదుడు - గజేంద్రుడు నిగ్గుతేల్చి చెప్పిన జ్ఞానరహస్యా లెన్ని? తెలుగు వచ్చును అనుకొన్నవారెంతమంది భాగవతాన్ని చదివినారు? సాహిత్యవిద్యార్థులకైన వాటిని (భారత భాగవతాలను) పూర్తిగా పాఠ్యగ్రంథాలుగా నిర్బంధం చేసినారా? వ్యాకరణశాస్త్రం - అలంకారశాస్త్రం - ఛందశ్శాస్త్రం తెలిసి ఉంటేనే ఆ భాషలో ఉన్న విజ్ఞానం అధ్యయనం చేయడానికీ - ఆచరణకూ ఉపయుక్తం అవుతుంది.

సృష్టిలో ప్రతి జీవజాతి రెండు భాగాలుగా వ్యాప్తి పొందుతుంది. ఒకటి స్వతస్సిద్ధంగా, రెండోది తీర్చిదిద్దడం ద్వారా వ్యక్తమై భాసించడం గోచరిస్తున్న సత్యం.

అభిమన్యుడు-ప్రహ్లాదుడు స్వతస్సిద్ధులు. వారు జనని గర్భమునందే జ్ఞానపూర్ణులైనారు. దుష్టసంహారార్థం బహిర్గతం అయినారు.

దౌష్ట్యాన్ని అణచిపెట్ట జాలినదే విజ్ఞానం.

సాధన చతుష్టయం అనగా : 1. నిత్యానిత్యవస్తు జ్ఞానము, 2. ఫలభోగ విరాగము, 3. సమాధిషట్కము, 4. మోక్షసక్తి - మానవ ధర్మముగా మన ఋషులు చెప్పినారు.

పరమాత్మ పరిపూర్ణరూపమే కృష్ణావతారము. ఆ అవతారమున మానవులకు లభించిన గీత యోగశాస్త్రమయం. యుగయుగాల మానవ భాగ్యోదయానికి- జీవనానికి- ఆచరణకు- ముక్తికి మార్గదర్శిని, విజ్ఞాన సర్వస్వం.

పిల్లలు మనం పెంచే తీరులో వృద్ధి పొందుతారు. వారికి మనం ఊహించిన అవసరాలమేరలో పోషణభారాన్ని వహిస్తాము. ఎంత లాగినా కుక్కతోక వంకరే వంటి జనం కూడా ఉండటం ప్రకృతిధర్మమేమో అనిపిస్తుంది. ఆ జీవలక్షణం అది. జన్మ ప్రాప్త సంబంధమయింది. ప్రాప్తము కర్మబంధ మయింది. ఈ రెండింటి మధ్యనే జీవుని లక్షణం వ్యక్త మవుతుంది.

తా నెవ్వడో - తనకే గుర్తించ వీలు కలదు.

ఉత్తమవిద్యాధ్యయనం - సత్సాంగత్యం - సద్గురు స్మరణలు - మానవున కతి ముఖ్యము. పిన్నలకూ పెద్దలకూ అవసరం.

: స్వస్తి :

# విశ్వంభర
# చదివింతరవాత

సమస్త జీవప్రపంచాన్ని భరించేది భూమి. ఈ భూమిలోనే పుట్టి పెరిగి అంతరించే జీవులలో ఒకడైన మనిషిని గూర్చిన వర్ణన విశ్వంభరకు ప్రాణం. విశ్వంభర అంటే భూమి."దేశమంటే మనుష లోయ్" అన్న గురజాడ సందేశం విశ్వంభరలో కవితాత్మక మైంది.

కవికి, కవితకు అకలంకమైన నిర్వచనా లున్నవి. అవి తెలిసి వ్రాసిన గ్రంథాలలో కవిత్వం లేనిదై కూడా ఉండటం గమనించాను. విశ్వంభరలో నిండా కవిత్వమే. ఇందలి కవితను కొలిచే పలుకు మూగదై పోక తప్పదు. విశ్వంభరలో వాడిన ప్రతిపదం వెనక ఎన్నో దృశ్యాలు కవితాపరమై నిలిచినవి. మనిషి తీరు మాట అనే లోకోక్తికి వలెనే కవి తీరు పలుకు అనేది కూడా ఉన్నది. పలుకు పల్లవాల మధ్య ప్రభవించిన అపూర్వమైన కవిత విశ్వంభర.

మనిషిని కదిలించేది మురిపించేది అందము. కవిత చాలా అందమైనది. ఈ అందాన్ని అక్షరగవాక్షల విప్పి చూడవలసి ఉంటుంది, ఈ విశ్వంభరలో ఆ మూర్తీభవించిన ప్రౌఢ యౌవనకవితా సౌందర్యం గుబాళించింది. మనస్సుకు రెక్కలు విప్పారింప చేసింది. విశ్వంభరను చుట్టి వచ్చింది. ఆ మనస్సు తెలిసి పలికిన పలుకే ఈ చిన్న వ్యాసంగా అవతరించింది. నుడికారాల పసలు, ప్రత్యేకించి వ్రాయవలసవస్తుంది. ఆ పని మరోసారి ప్రత్యేకించి తెలుపవలసి వస్తుంది. ఇంత చిన్న కావ్యంలో ఎంత పెద్ద కవితను నిలుపడమైందో విశ్వంభరను చూడక భావించలేను. ఈ కావ్యం కవితాత్మ గలవారే దర్శించి తీరాలె. భక్తులకు మాత్రమే భగవంతుడు దర్శన మిస్తాడు. కవులకు మాత్రమే విశ్వంభర కవితాదర్శన మిస్తుంది.

విశ్వంభర ఒక-అపూర్వ కల్పనాకృతి
తెలుగులో తొలుదొ_ల్త, పుట్టిన వచన పద్య కావ్యాకృతి
ఇది ఇరవయ్యో శతాబ్దపు
సదమల కవితావేశం
నారాయణరెడ్డి సుకవి నయన చకోర విలాసం
తెలుగు కళాలక్ష్మికి ఒక పునర్జన్మ-యౌవనగతి
అహో!

ఈ నా తెలుగున విరిసిన-అత్యాధునికత నిండిన
పండిన-కాదు సినారె బాల్వెన్నున
వండిన మానవేతిహాస రుచులు
త్రివిధములై -ద్వివిధ గతుల
ఏకైక కళానంద భారత భారతికి
పూర్ణ శశినివాళి—ఈ విశ్వంభర.
ఓహో! ఇది రసోదారమతి కంకితమా!
ఈ మాటకు మురిసిపోని
కవియే లేడని తలంతు.
మనిషి మనసు కథావస్తువై సాగిన
విశ్వంభర నభినుతింతు
వినూత్న వచన కావ్యమని తలతు.
అరివర్గ విద్రావణము
ఆద్యంత చైతన్యము
పదపదాన నవనవోదయాద్భుత రసోహలా
మనిషి కథలో-ఆగి చూడదగిన•
సన్నివేశములివి.

నేను-మనిషి ప్రతీక-అతడు పుట్టకముందే నీలితెర=ఆకాశం, నెత్తిమీద. ధూళిపొర=భూమి కాళ్ళక్రింద-ఉన్నదట. ఆ అకాశం

తెరకు అద్దాల బిళ్ళలు (నక్షత్రాలు) అద్ది ఉన్నాయట. వాటిల్లో కను రెప్పలనే మిణుగురు (పుర్వులు) లు (రెప్పలు) కాంతిప్ఫుటము మిటకరించినాయి. అని కావ్యం ఎత్తుకొన్న ఆరంభం తీరు, నుడికారపు పదవితతి గ్రథనతో......ఇట్లా

ప్రకృతి పరిణామశీలం - మనిషి రాకకోసం పడ్డపాట్లు
జలప్రతీక సముద్రంలో - భూప్రతీక శిలతో
పిచ్చిగా పరిగెత్తే కాంతి - అగ్నిప్రతీకలో ఈ రకంగా
పంచభూత ప్రకృతి మానవుణ్ణి ఆవిష్కరించడానికి చేసిన
ప్రయత్నం. మనిషి పుట్టి నేర్చిన భాష చిలుకముక్కులో
పల్లవించిన పలుకయింది అనడం వంటి విశేషత్వంతో
పూర్ణమానవత్వం - ఇక్కడకే అభివర్ణితమయిందీ కావ్యం
లో - అనగా మనిషి - భాష ప్రకృతినుంచి విడివడినది.
దాని - వాటి పరిణామగతులే ఈ కావ్యవిస్తరణం.

"తేనెచుక్కలు కలిపి కుట్టిన ఈగలు
విష బిందువులకు గూళ్లు గట్టిన నాగులు"

లక్ష్యంగా చేసి సాధించిన గృహవసతులు - అభివర్ణితాలయినాయి.

"ఏ మింటి ఇంటివాణ్ణి" అని భావించినాడు భూమిమీద నిలిచిన మనిషి.

అవని అంబరాన్ని కప్పుకొన్న దెట్లు గ్రహించిందో - దైవప్రతీక నట్లు కప్పుకొన్నట్లుగా ఈ మనిషి గ్రహించినాడు. నరుడే నారాయణుడు. అనగా దైవప్రతీక నరుడయినట్లు - కవి భావించడం అయింది.

నడక ఉంది అడుగులకు తెలియక
పెదవులకు తెలియక పలుకు - కూడా.

ప్రతి పాదం, ప్రతి పదం కవితోహలతో అత్యాధునిక వచన కవిత్వ మహా కావ్యంగా ఉంది-విశ్వంభర. "నిరుపమాన ప్రతీకలతో" (అలంకారాలతో) ఎదిగి సాగింది. ఆరంభవిస్తృతులు - అటుంచాం - విశ్రాంతి ఎట్లున్నదో చూద్దాం. నింగి నేలలే కాదు, దశదిశా వలయంగా అద్భుతానంద రస వైభవంతో ప్రస్తరమైన ఈ విశ్వంభర తొలి తెలుగు వచన మహాకావ్యం. విశ్రాంతి నిర్భర సన్నివేశం.

కాలం ఉంది కదలక పారే నది అది - అని దర్శించిన కవి ఇక తెలుసుకొనవలె నసే దైవం లేదన్నది నిజం.

చిరునవ్వులు చెక్కుకున్న ముఖాలు

అరమోడ్చిన కళ్ళతో ఆవిర్భవిస్తున్నాయి - అన్న ఈ కవి కృతినాయకుడైన మనిషి (పురుషుని) మనస్సుకు ఏకైక శరణమయ్యింది అతిలోకశక్తుల సంస్మరణం. ఆగని మనస్సు నమ్మకాల మధ్య నలిగింది. తర్కంలోకి సాగింది.

మూలతత్త్వం ఒక్కటైతే ముసుగులెందుకిన్ని? అని ప్రశ్నించు కొని

"పరమార్థం ప్రవచించే లక్ష్యం
నరబలులకు దారితీస్తుందా" అని విచారించి

"ఏ రంధ్రపుకోత లేకుంటే ఎట్లా పుడుతుందీ వేణువు" అని పరిశ్రమనుంచే విశ్రాంతి పుడుతుందని రహస్యాన్ని గ్రహించి ఈకవి మనిషి చేష్టల్ని-జీవప్రపంచాన్ని-కళారంగాలను ఎన్నిటినో ఇందు అభివర్ణించక విడవలేదు.

అద్యంతాలను కొలిచే ప్రయత్నంలో ఈ కవి భావన ఇట్లా చెప్పడం నాకెంతో ఆనందాన్ని ఇచ్చింది.

"గుహనుంచి మహలుదాకా

నడకనుంచి రోదసీ నౌకదాకా". చాలును ఈ రెండు నరుని పరిణామ జీవన కర్మగతిని పట్టి చూపేందుకు.

"దేశాల గీట్లను తుడిచి" విశాలత్వాన్ని నింపుకొన్న జ్ఞాన ప్రతీకగా ఈ పాదం చెప్పుకోవచ్చు.

'సామ్యవేదం'
'క్రాంతినాదం'
'విప్లవనేత'
'గతం గీసిన గీత'

కదను తొక్కిన పిడికిళ్లు, అరుణకిరణ పటాలాలు, చిందిన స్వేద బిందువులకే అందిన సస్యఫలాలు, పరిశ్రమించిన శరీరాలకే ప్రాప్తించిన నిత్యసుఖాలు-గా చెప్పిన ఈ భావాలలో ఒక మహోన్నత ప్రజాస్వామ్యమైన ప్రభుత్వాన్ని అభివర్ణించినారు శ్రీ రెడ్డిగారు.

సమతను సాధించే ఆ అడుగు పదం
స్తంభించిపోదో మేరకు.

సత్యమే. ఈ కవి కవితకు విశ్రాంతి లేదు అని చెప్పిన ఈ కవి ఆజన్మసిద్ధుడుగా నిలిచినాడు. ఒక మేరకు అన్నారు.

"నిరాడంబరంగా సాగే ఆ అడుగు
గిరీంద్రాల తలలు వంచింది"

గాంధీమహాత్ముని గురించి కాని - అంతటి మహనీయు లయిన మనుషుల గురించి కాని ఇంతకన్న గొప్పగా ఏ కవీ వ్రాయలేదు - అనే అంత గొప్పగా ఈ రెండు పాదా లున్నాయి.

తెలుగు దేశం - తెలుగు జాతి - తెలుగు భాష తర తరాలుగా మరచిపోరాని మహా కావ్యం "విశ్వంభర"ను నిర్మించిన మహాకవి నారాయణరెడ్డి స్తూయమానుడు.

మట్టిలోంచి మింటిలోకి చిమ్ముకొచ్చిన మానవుడే నారాయణ రెడ్డి మాటలకందని శ్రుతిలో మనస్సుతో ఘోషించాడు అంటాడు - ఇది నిత్య ప్రస్థానం. ఎగుడుదిగుళ్లు తప్పవని. దిగుళ్ళలో ఉంది భావార్థ చమత్కృతి.

వల్లకాటి దిబ్బల చుట్టూ
ఊళ్ళ కాపురాలు

వైరాగ్యప్రతీకకు నిలచే పాతా లివి. ఆకులు రాలిపోతే నేం చిగురాకులు పుట్టవా ! ఆత్మవిశ్వాసాన్ని స్థిరీకరించిన పాదా లివి.

"ఏ మసకసందెలు కమ్ముకున్నా
ఆ మనస్సుకాంతి చక్షువే.
ఏ మంచుగడ్డలు పేరుకున్నా
ఆ మేథ జ్వలనధాతువే"

ఇట్లా చెబుతూ రెక్కలు రెంటితో ఈదుతూనే దిక్కుల్ని గిల కొడుతూ తరలే జీవితం గురించి చెబుతూ అది తిరిగిచూడని చిరపథం అంటున్నా డీ కవి. "పునర్జన్మ న విద్యతే," పునర్జన్మ జన్మకు లే దంటున్నాడు. మంచి చెడ్డల్ని కొలిచే తులారూపం మనస్సు అని అనితరసాధ్యంగా తేల్చిచెప్పిన ఈ కవి మనిషికి ఈ జగతి ఉడుపు గాక తప్పదన్నాడు. ఇదే విశ్వంభర తత్త్వం. అనంత జీవితకాలం సత్యమై భాసించక మానదన్న శక్తి విశ్వాసం స్వతస్సిద్ధమై రస సిద్ధుడుగా పండినాడు కవి. అందుకు మా నారాయణరెడ్డిగారికి నా త్రిదశాబ్ది సాహిత్య కర్మజ్ఞాన తపో వికాస పీఠాన్ని కానుకగా ఇవ్వా లని ఉంది.

'నవ్వని పువ్వు'తో లయను తొడిగి వికసించిన ఈ కవి కవితా క్రాంతిపుష్పము 'నాగార్జున సాగర్' నిర్మాణంలో సంభృత సంగీత నృత్య సంభార లయల హొయలతో కూడి సాగి 'కర్పూర వసంత

రాయలు' పరిమళ సోపాన పంక్తుల మేళవించి కమ్మని గేయకవిగా జలపాత ధారలతో పద్యకవిగా, ఋతుచక్రభ్రమణంతో సూక్తి సుధా రస మరీచుల దాశరథశ్యాలు గుప్పుమన చిత్రవిచిత్ర రజస్సులతో తెలుగులోక దశదిశల కప్పి ఒప్పి విశ్వంభరగా విలసిల్లి దేశ విదేశ విఖ్యాత బహుమతుల నుతుల పొందినందుకు తనదైన ఒక ప్రత్యేకతతో నిలిచిన వచనకావ్య మహాకవితగా తెలుగువాణి తెలుగు వెల్లి పదసరసీపహాశోభల నింపినందుకు కుందుర్తి ఎంత మురిసియుండునో. 'నా కవితా సమాలోచనలు'లో వ్యక్తం చేసిన కోరిక పూర్తి అయిన విశ్వంభర వచ్చింది. అందుకే అంతర్హితుడైనాడు.

విశ్వంభర 5 ఆశ్వాసాల వచన కవితా కావ్యం. సంఖ్యలో ఒకటితో మొదలయి 5 తో ముగిసింది. పంచమస్వరం నారాయణ రెడ్డిగారికి ఇష్టం. షడ్జధ్వానం నిరసించడు.

ప్రకృతి "పెదవి ముడివిప్పి చూసింది,

......................

మెత్తని వేళ్ళ కొసలతో
మేని నునుపును వడబోసింది"

అంటూ వర్ణితమైన 3వ ఆశ్వాసంలోని పదబంధాలు తెలుగు చక్కదనం చక్కిలిగింతలకు గురిఅయ్యిందిగా చెప్పవచ్చు.

'జాబిల్లి క్రమ్మెచ్చు'
'సూర్యుని కంటి కొలిమి'-'చిచ్చు వెలుగులు'
'తెల్లపూత', 'నల్లరంగు'
'కదలని కాళ్ళతో'
'చిగురాకు జేబురుమాళ్ల'
'పిరికి చీకట్లు', 'పల్లవ జయంతులు'
'రుధిర స్రవంతులు','దినాల గహనాలు'

వేలావలయాలు'

'ఉదగ్రనిదాఘతాపం', 'ఉన్మత్తఋతుగతులు'

'ప్రకృతిబడి', 'అక్షీణకాంతిగోళం', 'ఎత్తుగడ్డ'

'గుత్తాసొత్తు', 'పరుషాతపం', 'గాంధర్వ గంగలు'

'లలిత కవితలు', కోటకొమ్ములు', 'కాటిదిబ్బలు'

'చేదునిజాలు'

'కొడిగట్టిన ఊపిరి', 'రక్తబంధాలు', 'మౌనవాటికలు'

'హాయలుచూపులు', 'యవనాశ్వాలు', 'ఉక్కుకాళ్లు'

'పొగరుకత్తులు', నిప్పుల ఉప్పెన', 'రక్కసిగోళ్లు'

'పచ్చినెత్తురు'

'మాంసఖండాలు', 'రణోన్మాదం', 'హననతృష్ణ',

'ఉక్కునాల్క'

'ఉదగ్రమదం', 'కుళ్లిన శవాలు', 'కాంతి శిఖరం'

'ప్రజావాటం'

'దయాగుణం', 'పొగల పొరలు', 'ఇలా గర్భం'

'ఆత్మశోధన'

'ఆర్ద్రనివేదన', 'చీకటి ఒళ్లు', 'వర్ణాహంకారం'

'హోరెత్తే కోరలు'

'వడగాలి', 'పాలజడి', 'అఖండ దీపిక' వంటి వెన్నో పద బంధాలు కావ్యాంతర్భాగంలో కళ్లువిప్పి పలుకరించినట్లుంటాయి.

బహురమ్యంగా సాగిన ఈ కావ్యం తెలుగులోకాలకు వెలుగు కానుకగా అర్పించిన రెడ్డిగారికి ధన్యవాదాలర్పిస్తూ ఈ కవితాకాంతికి అంజలి సంఘటిస్తున్నాను.

'కవిర్మనీషీ పరిభూః స్వయంభూః'!

—o—

# ముఖం చూసి బొట్టు పెట్టడం

ఈ సామెతయేకాదు ప్రతి సామెత వెనక కొంతకథ ఉంటుంది. భాషలన్నిటిలో సామెతలుంటాయి. అవి వాగ్వ్యవహారంలో ప్రయోగింపబడతాయి. 'పిండికొద్ది రొట్టె' వంటిదే ఈ సామెత. ఈ తరగతికి చెందిన సామెతలు ఒకరకమైన క్రమతను తెలియచేస్తాయి. కోల ముఖానికి బిళ్ళబొట్టు, గుండుముఖానికి నిడివిబొట్టు బాగుంటుందనుకోవడం చూపరుల ఇష్టాలపై ఆధారపడి ఉంటుంది. నల్లముఖాలకు ఒకరకమైన రంగుబొట్టు, తెల్లముఖాలకు ఒకరకమైన రంగుబొట్టు బాగుంటుందని చెప్పడానికి రంగులు మార్చి బొట్లు పెట్టి చూసిగాని చెప్ప వీలుపడదు. ముఖాలకు బొట్లు పెట్టుకోవడం అలంకారంలోని భాగమే. ఆనాటి రామకృష్ణులు బొట్లు పెట్టుకొన్నట్లు నేటి కళాకారులు వేసే బొమ్మల్లో దించిన ముఖానికి అతికేటట్లు బొట్లు పెట్టడానికి చేసిన ప్రయత్నాలు తెలియచేస్తాయి. ముఖానికి అతికినట్లుగా బొట్టుపెట్టడం ఒక కళే. స్త్రీలు, పురుషులు బొట్లు పెట్టుకుంటుంటారు. ఆ బొట్లకు వాడే ద్రవ్యాలు నానారకాలు. మంచిగంధం, కుంకుమ, విభూతి, తిరుచూర్ణం, పచ్చబొట్టు లిత్యాదులు. ముఖానికి తీర్చబడిన బొట్టు ఆక్రమించే స్థలం వరకు పచ్చబొట్టు పొడిపించుకొనడం, దాని మేరలోనే బొట్టును దిద్దడంకోసం పచ్చబొట్టు వాడకంలోకి వచ్చింది.

ఇందులో అడ్డబొట్ల తెగ-నిలువుబొట్ల తెగలు వేరైపోవడం, కట్టు, బొట్టు చక్కదనాలను చాటే పరిమితంగా ప్రచారమయినాయి. హిందువులకు బొట్టు ఆచారమయింది. బొట్టును ద్వేషించే మానవతెగ వేరయింది. కట్టులో తలకట్టు శిరోజాలనుబట్టి ఉంటుంది. అందుకే 'వెంట్రుకలున్నమ్మ కొప్పు ఎట్లేసినా చక్కదనమే' సామెత ప్రచార

మయింది. ఈ సామెతల ప్రయోగం సందర్భాన్నిబట్టి అర్థాలు భిన్నించడం గమనించవలసి ఉంటుంది. ఈ బొట్లమీద ఒక గ్రంథమే వ్రాయవచ్చు. 'చుక్కబొట్టు' చుక్కను తలపించే బొట్టు, అనగా చుక్కవంటి బొట్టు ఉపమానోపమేయాలు వస్తాయి. సూర్యబింబాన్ని బొట్టుకు ఉపమానంగా వాడిన కవులున్నారు. నామంబొట్టు, పంగనామం బొట్టు, త్రిశూలం బొట్టు ఇవి నిలువుబొట్ల వర్గానికి చెందినవి.

లేదు పోవమ్మా ఆయన 'ముఖం చూసి బొట్టు పెడతాడు' అనే సందర్భాన్ని విమర్శగా తీసుకోవాలె. అతనికి ఇష్టమైనవాళ్ళకేమో మంచిగంధాన్ని, ఇష్టంలేనివాళ్ళకేమో బూడిదబొట్టు పెడతారని అనుకోరాదు. ఆయా వ్యవహారాలలో సందర్భాన్నిబట్టి ఈ అర్థం వేరైపోతుంది. ఉద్యోగ సందర్భాన్ని తీసుకొంటే తనవాళ్ళకు మంచి ఉద్యోగాలు, కానివాళ్ళకు తక్కువ ఉద్యోగాలు ఇస్తాడు అని అతణ్ణి దెప్పిపొడవటం సందర్భాన్ని చాటుతుంది. సర్వీసు సందర్భంగా వస్తే తనకు ఇష్టమైనవాళ్ళయితే చేరిన తేదీనుంచి, ఇష్టంకానివాళ్ళయితే కొన్నిరోజులైన తరవాత అక్కడినుంచి ఇస్తానంటాడు అని దెప్పిపొడవటమే. తెలుగు భాషలో ఈ సామెతలు వాడే పద్ధతి వేయి మాటలలో చెప్పబడే విషయం ఒక్కమాటలో సూటిగా సారవంతంగా సందర్భాన్ని తెలిపే విధంగా ఉంటుంది. నీటికొద్ది తామర, వసతికొద్ది ఆచారం, దుప్పటికొద్ది ముసుగు అనే ఈ సామెతలు తృప్తిపరంగా సరిపెట్టుకొనడానికి వీలుగా వాడబడినాయి.

ఆయా గ్రంథాలలో ఒక సామెత ఏ సందర్భాన్నిబట్టి ప్రయోగింపబడిందో తెలిపే గ్రంథాలు మనకు లేవు. ఈ పనికి ఒక పిహెచ్. డి. ఈయవచ్చును. సామెతలలో ఉపమానం ఉంటుంది, వక్రత ఉంటుంది. ఈ రెండూ భావాన్ని ఆకర్షిస్తాయి.

గురువుకు పంగనామం పెట్టాడు, అంటే గురువును సైతం ఎదిరించాడనే సందర్భాన్ని తెలుపుతుంది.

విధవ ముఖం బొట్టులేనిది, ఆదరణ లేనిది అవుతుంది. ఆ ముఖం దర్శనీయమయింది కాదు అనే అర్థంలో "విధవ ముఖం" నాకు చూపించకు. కార్యసాధకుడవు గాక నీవు నాదగ్గరకు ఎందుకొచ్చినావు? అనే అర్థాన్ని చాటుతుంది. కాని బొట్టు పెట్టుకొని రా అనే దానికి మాత్రం కాదు. విధవ ముఖం బొట్టులేనిదే అయినా ఈ సందర్భంలో ఆ అర్థం రాదు.

'సిందూరం' రక్తచందనం

సున్నాన్ని పసుపును కలిపితే ఏర్పడే రూపానికే సిందూరం అంటారు. దీన్ని చంద్రం అని కూడా వాడకంలో ఉంది. దీన్ని బొట్టుకూ, పాదాలకూ వాడేటప్పుడు పారాణిగా ఉపయోగిస్తారు. ఇవి భావోద్రేకాలను చాటేవి.



"సిందూరం రక్తచందనం
బందూకం సంధ్యారాగం
పులి చంపిన లేడినెత్తురు
కావాలోయ్ నవ కవనానికి"



అన్న శ్రీ శ్రీ పాదాలలో "కవిత్వం ఎర్రదనంగా ఉండా" అన్నాడు. ఇవి తీసికొచ్చి కూరిస్తే కవిత్వం అవుతుందనీ ఎవడనుకుంటాడు? సహేతుకతను విడమరచలేని వ్యవస్థ ఇది. వీరులకు రక్త తిలకం దిద్దడం ఆచారం.

"సిందూరం" రసవస్తువు కూడా. రసం, ఇంగ్లీకం, రసకప్పూరం రససిందూరాలు మందులుగా తీరుస్తారు. వైద్యంలో వీటి ప్రయోజనం వేరు. సిందూరం ఎర్రగా కూడా ఉంటుంది, ఇది చంద్రసంబంధమైతే బొట్టు (సున్నం-పసుపు కలిపినది)గా వాడతారు. ఆదేకాక సంస్కృత వాఙ్మయంలో మహాకవి కాళిదాసు నైతం బొట్టును అభివర్ణించినాడు.

"కస్తూరీ తిలకం లలాటఫలకే" అని.

తిలకాలలో కస్తూరీ తిలకం ఒకటి. సాదుబొట్టు కూడా ఒకటి ఉన్నది.

## సాదు బొట్టు తయారీ విధానం

తుమ్మకాయల్ని (పండినవాటిని మాత్రమే) తెచ్చి, దంచి, పిప్పిని తీసివేసి ఆ కాయల వగరును ఇష్టం వచ్చిన రంగుతో మేళవించి గిన్నెల్లో పోసి ఎండబెడితే గట్టిపడుతుంది. ఆ గట్టిపడినదానిని అవసరంవేళ వాడుకొనేటప్పుడు కొంచెం నీటిచుక్కలు వేసి వ్రేలితో వ్రాస్తే గంధం వస్తుంది. ఆ గంధాన్ని తిలకంగా (బొట్టుగా) దిద్దుకోవచ్చును. ఈ పని నేను చేసినాను. మా నాయనమ్మ వీరమ్మగారు ఈ పనే కాదు, ఎన్నో పనులు స్వయంగా నేర్పినారు. సిరా తయారు చేయడం, పిండివంటలు తయారుచేయడం చూపించినారు. కాని చేసే అవకాశం కలుగలేదు. అన్నం వండేది తెలియలేదు. ఆ పని కాళోజీ మహాకవిగారు ఎం. ఎల్. సి. గా ఉన్నప్పుడు న్యూ ఎం.ఎల్.ఎ. క్వార్టర్సులో నేర్పినారు. నాకు మూలికావైద్యం తెలుసు, మూలికలు చేసే పని ఏమిటో మరో వ్యాసంలో వ్రాస్తాను. నాకున్న జ్ఞాపకాలు ఒక గ్రంథంగా వ్రాయాలని ఉన్నది; వ్రాస్తాను.

జానపద బాణీలలో రోకటి దర్వు, ఇసుర్రాయి దర్వు, కోలాటం దర్వులు, చిటికెల భజన, అడుగుల భజనతోబాటు భజన, తత్త్వకీర్తనలు ఏ రకంగా పాడుతారో, వీధినాటకాలు, తోలుబొమ్మలాటలు, రాజకీయపార్టీల పాటలు, బాలసంతు, ఫకీరు-బిచ్చగాండ్ల-పిచ్చుకుంట్ల వంటి వారి పాటల దర్వులు, కొట్టఃగోల పాటలు, కాముని పూర్ణిమా పాటలు - ఇవి ఎట్లా ఉంటాయి? వీటి లక్షణాలు, వీటి వయారాలు ఎట్లా ఉంటాయి? తత్త్వాలు ఎట్లా ఉంటాయో ఇవి అన్నీ నా పదునాల్గో ఏడుకే నేర్చుకొన్నాను. బుర్రకథలు, బతుకమ్మపాటలు, గారడీవిద్య

గంగెద్దుల-బైనివాండ్ల-బైరూపుల పాటల దరువులు, మల్లన్న సిగం పాటలు ఇవి అన్నీ నాకు కరతలామలకమే.

లత్కోరుసాబ్ మాటలు, జ్యోతిష్కుల పంచాంగ కథలు, వీటిలో గల మెలికలు గ్రహించినవాణ్ణి. "నా అనుభవాలు" పేర ఒక గ్రంథం కూడా వ్రాయగలను. మంచి విషయాలకు చోటు లభించని రేడియో, టెలివిజన్ వంటివే కాక పత్రికలు కూడా సహకారం ఇస్తే ఉత్సాహంగా అనేక విషయాలు చెప్పడానికి వీలున్నది. అనవసరంగా కాలం వృధా చేయటం నాకు ఇష్టం ఉండదు. గాంధిమహాత్ముని ఆత్మ శక్తి ప్రభావం, నైర్మల్యం మానవులలవరచుకొంటే - చదివిన చదువుకు, ఆర్జించిన కష్టానికి గొప్ప విలువ లుంటగలవు. సమాజాన్ని పెడత్రోవకు పట్టించే విధానాలు నాకు ఇష్టం ఉండవు. సత్యదీప్తిని ప్రభావితం చేసేవారంటేనే నాకు ఇష్టం. అవకాశాన్ని చిక్కించుకొని ఈ కృషిని ఇక కొనసాగిస్తాను. ఆదరించే పరిసరాలకు ధన్యవాదాలు. బొట్టుజోలి ముగింపు చేస్తున్నాను.

—o—

# అణా గ్రంథమాల ఉద్యమం

1938 సం॥లో ముఖ్యంగా శ్రీ కె. సి. గుప్తగారు వెల్దుర్తి మాణిక్యరావుగారి తోడ్పాటుగా అణాగ్రంథమాలను స్థాపించి ఆనాటి తెలుగుజనంలో జాతీయోద్యమాన్ని, స్వాతంత్ర్యేచ్ఛను రగుల్కొల్పినారు. ముఖ్యంగా ఈ ఉద్యమాన్ని కె. సి. గుప్తగారు నడిపినారు. నిజాం పరిపాలనకు వ్యతిరేకంగా భారతస్వాతంత్ర్యానికి అనుకూలంగా ఈ అణాగ్రంథమాల-ఉద్యమం సాహసోపేతంగా పని చేసింది.

నాకు లభించిన "కాళోజీ కథలు" అనే గ్రంథం ఆధారంగా ఈ లఘువ్యాసం రూపొందింది.

కాళోజీ కథలు అనే ఈగ్రంథం 24వదిగా ప్రచురణ 1943 లో అయింది. అందులో శ్రీ కె. సి. గుప్తగారు స్వవిషయంలో ఇట్లా చెప్పుకొన్నారు.

"అణా గ్రంథమాల స్థాపించి మూడు సంవత్సరాలు కావచ్చినవి. మొదటి సంవత్సరం అన్నట్లు 'సంవత్సరానికి 12 పుస్తకాలు' పాఠకులకు అందచేసినాము. తరువాత సంవత్సరానికి 25 పుస్తకాలు ప్రకటించాలనుకొన్నాము. కాని, కాగితము కరువువల్ల అన్నట్లు చేయలేకపోయినందుకు విచారపడుతున్నాము. ఇప్పటికి ఇరవైనాలుగు పుస్తకాలు ప్రచురించినాము. యుద్ధమువలన కాగితముధర విపరీతముగా పెరిగినది. కాగితము కరువు లేకపోతే ఇంకా పుస్తకాలు వేయగలము.

"అణాగ్రంథమాల 20వ ప్రచురణము 'సుభాస్ చంద్ర బోస్' ప్రకటించినందులకుగాను ప్రభుత్వ నిర్బంధానికి గురియై గ్రంథకర్త 18 మాసాలు కఠినశిక్ష - ప్రకాశకుడ నగు నేను

ఒక మాసము శిక్ష, రు. 250/-ల జురుమానాతో పది మాసాలు కోర్టుకు తిరిగి వ్యవహారాలు ముగించుకొని మీ సేవ జేయుటకు సిద్ధమైనాను.

ఆంధ్ర పబ్లిషింగ్ కంపెని — ఇట్లు
సుల్తాన్‌బజార్, హైదరాబాదు — కె. సి. గుప్త
ఏప్రియల్ 1943 — ప్రకాశకుడు"

వాస్తవంగా ఈ అణాగ్రంథమాల 1940 నుంచి తీవ్రంగా పని చేసింది. తెలంగాణాలో ఆంధ్రోద్యమానికి అనుబంధంగా గ్రంథాల యోద్యమాలు కూడా గొప్పగా పని చేసినాయనే చెప్పవచ్చు. అట్టి గ్రంథాలయోద్యమాలలో అణా గ్రంథమాలోద్యమం ఘనంగానే పేర్కొనతగింది.

ఈ పుస్తకాలకు సంవత్సరానికి 10 రూపాయలే చందా. కల్దారు అణాబిళ్ళ ముఖపత్రంలో అచ్చువేయబడి ఉన్నది. అణాకల్దారుకు ఒక పుస్తకం అమ్మడం అయింది.

## ప్రచురించిన గ్రంథాలు

1) హైదరాబాదు, 2) రాజ్యాంగ సంస్కరణలు, 3) ఆంధ్ర వీరులు, 4) అణాకథలు, 5) స్వామీ దయానంద సరస్వతి, 6) సావర్కార్ జీవితము, 7) కాంగ్రెస్ చరిత్ర [1వ భాగం], 8. కాంగ్రెస్ చరిత్ర [2 వ భాగం], 9) జాగీర్లు, 10) మొగలాయి కథలు [1వ భాగం], 11) పండిత జవహర్‌లాల్ నెహ్రూ, 12) మాలతీ గుచ్ఛము, 13) ఎల్లోరా-అజంతా, 14) మణిమేఖల [నవల], 15) మొగలాయి కథలు [2వ భాగం], 16) సోషలిజం, 17) ఎం. ఎన్. రాయ్, 18) నా కొడుకు [నవల], 19) అనువంశికము - వాహకులు, [1వ భాగం], 20) అనువంశికము-వాహకులు, [2వ భాగం], 21) బమ్మెరపోతన, 22)ఖాది, 23) ప్రతిఫలం [నవల], 24) కాశోజీ కథలు

ఈ గ్రంథంలో ఉపయోగించిన అంకెలు తెలుగువే. ఈ గ్రంథాలను ఇంటింటికీ సప్లయి చేసేవారు.

ఈ కాళోజీ కథలల్లో మొదటిది ''మనమే నయం''
రెండోది ''తెలియక ప్రేమ - తెలిసి ద్వేషము''
మూడోది ''విభూతి లేక ఫేస్ పౌడర్''.

ఈ కథలల్లో చక్కని తెలంగాణా భాష వాడబడింది.

ఈ అణా గ్రంథమాల సాంఘిక, రాజకీయ నాయకుల జీవితాలతోబాటు అనేక విషయాలతో కూడిన 100 గ్రంథాలు ప్రచురించడానికి సంకల్పించిన లక్ష్యంలో ఎట్లాగో 25 గ్రంథాలు ప్రచురించగలిగినారు. వాటిలో 20 వ ప్రచురణ సుభాస్ చంద్రబోస్ జీవిత చరిత్ర.

1942 లో ఈ పుస్తకాన్ని నిజాం ప్రభుత్వం నిషేధించి శ్రీ కె. సి. గుప్తగారిపై కేసు పెట్టింది. గుప్తగారి పక్షాన ఆరుగురు ప్రముఖ న్యాయవాదులు కోర్టులో పాల్గొన్నారు. రాజకీయాలు ప్రచారం చేయడం, ప్రజలు ఆమోదించని రాజ్యాం ఉండకూడదనీ, ప్రజా పరిపాలన కావలెననీ చెప్పడం ప్రజల జన్మహక్కు అని న్యాయవాదులు కోర్టులో వాదించినారు. న్యాయమూర్తులు గుప్తగారిని చూసి చాలా చిన్నపిల్లవాడు-అని ఆక్టులో 12 సంవత్సరాలవరకు శిక్ష వేయవచ్చునని ఉన్నా ఆరుమాసాలు మాత్రమే ఈ కారణంగా శ్రీ గుప్తగారికి శిక్ష విధించినారు. ఒకనెల జైలుశిక్ష ననుభవించినతరవాత హైకోర్టులో చేసిన అప్పీలులో తక్కిన 5 మాసాలు శిక్షను అనుభవించవలెనని లేదా రెండువందల యాభై రూపాయలు జరిమానా కట్టవలెనని తీర్పు ఇచ్చినారు. 1-9-1919 న జన్మించిన శ్రీ కె. సి. గుప్తగారు జైలు ననుభవించేనాటికి 23 సంవత్సరాల యువకుడు. ఈయన పూర్తిపేరు కలువకుంట్ల చంద్రసేన్ గుప్త. ఇంటిపేరు కలువకుంట్ల. ఈయన తల్లిదండ్రులు లక్ష్మమ్మ రామన్నలు. విద్యార్థి దశలోనే సంఘసేవా

స్వభావం కలిగి జనకంటక నిజాం రాజ్యవ్యవస్థకు వ్యతిరేకంగా కార్యశూరత్వాన్ని ప్రదర్శించినాడు.

గుప్తగారు 1938 లో హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌లో సభ్యులైనారు. అప్పుడున్న మొత్తం ఐదుగురు సభ్యులలో శ్రీ గుప్తగారు ఒకరు. కాంగ్రెసుసంస్థపై నిజాంప్రభుత్వం నిషేధం ప్రకటించి ఉన్నందువల్ల హైదరాబాద్ స్టేట్‌కాంగ్రెసుసభ-సమావేశం మన్మాడ్‌లో జరిగింది. అందులో బాధ్యత గల సభ్యుడుగా శ్రీ గుప్తగారు పాల్గొన్నారు. హరిపూర్‌లో జరిగిన ఆలిండియా కాంగ్రెస్‌సభలో కూడా శ్రీ గుప్త పాల్గొన్నాడు.

ఆంధ్రమహాసభ హైదరాబాద్ పట్టణ సంఘానికి ప్రధాన కార్యదర్శిగా ఉండి శ్రీ గుప్తగారు ఎన్నో మహాసభలు జరిపించి ఆంధ్రోద్యమాన్ని గ్రంథాలయోద్యమంతో సమన్వయంగా తెలుగు జాతిని మేల్కొల్పినాడు.

1940 లో కమ్యూనిష్టు పార్టీతో సంబంధం ఏర్పడి సభ్యుడై పది సంవత్సరాలు దాని అనుబంధసంస్థ లన్నింటిలో పనిచేసినారు.

16-10-1946 న నిజాం ప్రభుత్వం శ్రీ గుప్తగారిని మళ్ళీ అరెస్టుచేసి [డిటెన్యూగా] జైలులో పెట్టింది. నిజాం ప్రభుత్వంలో డిటెన్షన్లకు కాలపరిమితి లేదు.

ఆ కాలం రాజకీయాలలో జైలుకు వెళ్ళి తిరిగివచ్చే అవకాశాలు రాజకీయంవారికి చాలా తక్కువ. 39 మాసాలు 'ఎ' క్లాసు డిటెన్యూగా ఉన్న గుప్తగారిని సంగారెడ్డి, వరంగల్, గుల్బర్గా, హైదరాబాదు జైళ్ళల్లో ఉంచింది.

1908 లో మూసీనదికి వచ్చిన వరదల్లో శ్రీ గుప్తగారి ఆస్తిపాస్తులు కొట్టుకపోవడంతో ఆస్తిపాస్తులు లేని కుటుంబీకులుగా మారినారు. సుమారు 75 సంవత్సరాలకు పూర్వం హైదరాబాదు నగరంలో వారి కుటుంబం సంపన్నమయింది.

స్వతంత్ర భారత ప్రభుత్వం స్వాతంత్ర్య సమరయోధునిగా గుర్తించి, తామ్రపత్రం సమర్పించి పెన్షన్ ఇస్తూ ఉంది.

1950 నుంచి రాజకీయరంగాన్ని వదిలిపెట్టి వైశ్య సంఘంలోని బీదజనానికి సేవలు చేయడం ధ్యేయంగా కొనసాగిన శ్రీ గుప్తగారు చాలాకాలంగా తనకు వచ్చిన నెలసరి ఆదాయం నుంచి పది శాతం సాంఘిక కార్యక్రమాలకు, ఇతర సేవలకు వినియోగించడం నేటికీ కలదు.

1954 లో పునరుద్ధరించిన నిజాం రాష్ట్ర వైశ్య మహాసభకు కార్యదర్శిగా ఉన్నారు. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ పేరుతో నడుస్తున్న ఈ సంస్థకు 17 సంవత్సరాలు సేవ లందించినారు. 1939 లో కాచీగూడా చౌరస్తాలో వైశ్య విద్యార్థి వసతిగృహాన్ని ప్రారంభించి దాని ఔన్నత్యంలో పది సంవత్సరాలు గౌరవ వార్డెన్‌గా పదకొండు సంవత్సరాలు నామమాత్ర అలవెన్స్‌తో వార్డెన్‌గాను, మరో రెండు సంవత్సరాలు గౌరవ ప్రధానకార్యదర్శిగాను మొత్తం 23 సంవత్సరాలు సేవలందించిన ఘనత గుప్తగారికి దక్కుతుంది.

1939 లోనే వైశ్య యువజన సంఘాన్ని స్థాపించినారు. వీరు తన 45 వ ఏట ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి 'బి.ఏ.' పట్టాను పొందినారు. 1956 లో 'గుప్త మాసపత్రికను ప్రారంభించి దానికి ముఖ్య సంపాదకులుగా నిలిచి 14 సంవత్సరాలు నడిపించి 4 వేల రూపాయల నష్టంతో ఆపివేసినారు,

ఆ తరవాత ఎన్నెన్నో వైశ్యసంస్థలను స్థాపించి వాటిని సరియైన మార్గంలో ఉంచి తగిన యాజమాన్యానికి అప్పగించినారు. అయినా నేటికీ అఖిలభారత వైశ్యసమాజ్ పేరుతో గ్రంథాలు ప్రచురిస్తున్నారు.

వీరిద్వారానే " భారత దేశంలో వైశ్యులు " అనే విషయంలో వైశ్యుల ఔన్నత్యాన్ని తెలిపే పది గ్రంథాలు, ప్రత్యేక సంచికలు ఎన్నో వెలువరించినారు.

అనేక సంస్థలల్లో సభ్యులు. సేవా కార్యక్రమాలు నేటికీ నిర్వహిస్తుంటారు. గ్రంథాలు చరిత్రకు ప్రాణం అనే రహస్యం తెలిసిన జ్ఞాని. నిరాడంబరుడు. సాధారణ జీవనుడు. నిత్యసంతోషి. గ్రంథకర్తల్ని కవుల్ని పండితుల్ని ఆదరించే దొడ్డబుద్ధి ఆయనకు జన్మతో అబ్బింది. శ్రీ గుప్తగారిని ఎరుగని హైదరాబాదు సంఘనాయకులు లేరు; రాజకీయ నాయకులు లేరన్నమాట అతిశయోక్తిగా ఉండదు. ఆళ్వార్‌స్వామి, దాశరథి, కాళోజి, దేవులపల్లి రామానుజరావు, మాడపాటి హనుమంతరావు, బూర్గుల రామకృష్ణారావు, రావి నారాయణరెడ్డి, మగ్దూం వంటి మహోన్నతులందరూ గుప్తగారి సేవను వ్యక్తిత్వాన్ని ఆదరించినవారే.

గ్రంథాలయోద్యమం జాతీయతను పెంపొందింపచేసి జనాన్ని చైతన్యవంతులుగా చేస్తుందన్న గుప్తగారి నమ్మకానికి అణా గ్రంథమాలోద్యమమే సాక్షి. తెలిసినంత మేరలో ఈ వ్యాసాంశానికి ఉపయుక్తమైన గ్రంథాలు ఈ క్రిందివి. అందుకు ధన్యవాదాలు.

1. ఆంధ్రప్రదేశ్ చరిత్ర-ఆధునిక యుగం.
2. కాళోజీ కథలు.
3. మధువనం (నా పాటలు).

—o—

# పద్యమే కవిత్వం!

ఏ భాషలోనైనా కవిత్వం అనేది పద్యాత్మకమయిందిగానే దాహోటంగా చెప్ప వీలున్నది. ప్రపంచంలో ఈనాడు లిపిగల భాషలు-లిపిలేని భాషలు అని రెండు తరగతులుగా విభాగం చేసుకొనవచ్చు. వాగ్రూపంగా భాష ఏర్పడింది. ఆ తరవాతనే లేఖనాత్మకమయింది. ఆయా ప్రకృతి పరిసరాలలో జీవించే జనం నానా సంకేతాలతో భాషను వృద్ధిచేస్తుంటారు. అంతరించిపోయే పదాలతోబాటు పుట్టుకవచ్చే పదాలు కూడా వుంటాయి. భాషలు ప్రాదేశిక నామంతో జాత్యాది నామంతో పిలువబడటం చూస్తుంటాము. ఆంధ్రదేశంలోని భాష ఆంధ్రభాష అని చెప్పుకొన్నా-ద్రవిడ ప్రాంతంలోని భాష ద్రావిడ మనుకొన్నా తెలుగుజనం వాడే భాష తెలుగన్నా ఏ ప్రాంత మందైనా ఏ ఒక్క భాషో అక్కడ జీవించేవారిదని చెప్పలేము. మనిషి తన అవసరాలను తీర్చుకొనడానికి భాషను ఆశ్రయించటం చూస్తున్నాం. నైజాం కాలంలో తెలుగువారు ఉరుదూ భాషను అధ్యయనం చేసినారు. తెలుగు భాషను తెలిసిన మహమ్మదీయులుకూడా ఉన్నారు. ఆంగ్ల ప్రభుత్వాధిపత్యంలో తెలుగువారు ఇంగ్లీషును అధ్యయనం చేసినారు బ్రౌన్‌వంటి ఇంగ్లీషువారుతెలుగును నేర్చినారు. సంస్కృతం నేర్చిన బ్రాహ్మణేతరులు-విదేశీయులూ ఉన్నారు. ఏఒక్క వర్గానికో కులానికో ప్రాంతానికో మతానికో పరిమితంగా భాషలుండవు. నేరిస్తే వచ్చేది భాష. తెలుగుదేశాన లిపిరహితమైన శవరభాష లెన్నో ఉన్నాయి. కోయభాష (గోండుభాష), ఎరుకల భాష, లంబాడీ భాషల వంటివి ఉన్నాయి. అయితే ఆ భాషలలో కూడా మంచి పాటలు ఉన్నాయి. ఆ పాటలే ఆయా ఆటలల్లో నృత్యాత్మకం సంగీత వాయిద్యాత్మకం చేస్తూ పాడటం చూస్తున్నాం. వారు వాటిని పాటలంటారు. ఈనాడెందరో మహమ్మదీయులు తెలుగు నేర్చినారు. ఇంగ్లీషునుకూడా అధ్యయనం చేసినారు.

సంస్కృతంలో కవిత్వాన్ని నానారకాల శ్లోకాలుగా చెప్పడం ఉన్నది.

ఇంగ్లీషులో పొయిట్రీ-ప్రోజు అని రెండు శాఖలుగా భాష విభాగమయ్యింది.

తెలుగులో గద్య పద్యాలుగా విడదీసుకొన్నాము. అట్లాగే హిందీ-ఉరుదూ-కన్నడ-వంగ-ఓఢ్ర భాషలలో పద్యగద్య భేదాలలో ఒకపేరు గలిగి ఆ భాషలు కొనసాగుతున్నాయి. రాకపోకలమూలంగా సంబంధ బాంధవ్యాల మూలంగా పదాలు ఒక భాషలోనివి మరో భాష లోనికి రావడం చూస్తున్నాం. ఉదాహరణకు తెలుగు భాషలో 'రోడ్డు, సడకు' వంటివి రెండు భిన్న భాషలకు సంబంధించిన దృష్టాంతాలు అని భావిస్తే అట్లాగే అన్యదేశ్యాలు సామెతలు లోకోక్తులు కూడా మేళ విస్తాయి.

అయితే పద్యాల్లో ఉండేదంతా కవిత్వం కాకపోవచ్చును. వైద్య శాస్త్రం పద్యాల్లో వ్రాస్తే కవిత్వం కాదు. కవిత్వం ఏదో ఒక లయ గతికమయిందిగా మనం చెప్పుకోవాలె. గద్యాన్నికూడా లయగతికంగా వ్రాసిన పూర్వీకులూ ఆధునికులూ ఉన్నారు. కొన్ని భాషలలో కవిత్వం లేదు అనేవారు కూడా ఉన్నారు. మనిషి రసప్రియుడు. అది శృంగా రమే కానక్కరలేదు. నవవిధరసాలు అని మన పూర్వులు గణించి నారు. రసమనగా నేమి? అదెన్ని విధములు-అని మళ్లా మొదటికి రాదగిన ప్రశ్న వేసుకొంటే వేసుకొందాంగాక దానివలన తేల్చదగిన ప్రయోజనం కొత్తదేదైనా ఉంటే దాన్నికూడా మనిషి అనేవాడు ఆహ్వా నిస్తాడు. మనోభావాలను-ఉద్రేకాలను పసికట్టి వింగడించే పద్ధతులతో కూడినదే కవిత. అది ధర్మ ప్రతిపాదకమైనది. సత్యసంపూజ్యమైనది. కవులు నిరంకుశులు. కవిత్వం నిర్వచనమయింది. నిరుపమాన మయింది. అది ఏడుపూ-నవ్వూ అనే భేదాలతో కొనసాగుతుంది. భాషాశాస్త్రజ్ఞులు ఏ భాషలు ఎప్పుడు పుట్టినాయి? అవి ఎన్ని?-ఏ ఏ

రాజవంశాలచేత-జనంచేత పరిపోషింపబడినవి? అనేవాటితో ప్రస్తుత సంగతి నిమిత్తం కాదు. కవిత్వం మూగగా పుట్టింది. హస్తవిన్యాసాలలో నేత్రవిన్యాసాలలో అభివ్యక్తమయింది. భాషలు వచ్చినాయి. అందులో ప్రవేశించింది. అది ఇట్లాంటిదని, దేవుడిట్లాంటివాడని నిరూపించడానికి అనుసరించే విధానాలు ఏవైనా ఉంటే అవే సమగ్రమైనవని చెప్పలేము. సృష్టిలో ఏదో ఒక అసంతృప్తి-అసంపూర్ణత ఉన్నది. అందుకే ఈ సృష్టి యుగాలుగా కొనసాగుతూ వచ్చింది. సత్యం అనేది, వాడు (వ్యక్తి) విశ్వసించిన ఒక భావన. ఆ భావాన్నిబట్టి ఆ సత్యం గోచరిస్తుంది. చూచేదానినుంచే చూడరాని చూడలేని అత్యంత సూక్ష్మము కలదని గ్రహిస్తాడు. ధర్మసూక్ష్మ మాత్రీరైనదే. నీలా జంగయ్యనైన నన్ను సూక్ష్మాన్ని చూపమంటే నేనేమి చూపగలను. చూసినదాన్ని తోచినవిధంగా చెప్పగలను. పద్యం కవిత్వం కాదంటే ఎట్లాగండీ! నాకు తెలిసినమేరకు గ్రహించినమేరకు పద్యమే కవిత్వమని చెప్పక తప్పడంలేదు. తెలుగుభాషలో నన్నయ వ్రాసిన భారతంనుంచి వ్రాతలో గల కవిత్వాలు నేటికీ లభిస్తున్నాయి. వ్రాతలో ఇవన్నీ నిలిచినాయని చెప్పలేను. ఇకముందు కూడా వ్రాతలో ఉన్నవన్నీ నిలుస్తాయని నేననుకోను. నన్నయకు పూర్వంనుండీ వ్రాతలో లేని జానపద సాహిత్యం తెలుగుదేశాన ఎంతో ఉండి ఉంటుంది. ఎంతోకాలంగా జానపద సాహిత్యం జనం నోళ్ళే పుస్తకాలుగా బతికింది. దాన్ని కొందరు సేకరించి అక్షరబద్ధం చేసినారు. అంటే అక్షరాస్యులకు ఈ సాహిత్యం చదువుకొనడానికి ఉపయోగపడుతుంది అని-ఆ గ్రంథాలు అక్షరాస్యులు చదవకపోతే పనికిమాలిన వవుతాయి. మనిషి తెలుసుకోవడానికి వీలైన విశేషాలెన్నో అందుంటాయి అక్షరాస్యులుగాని జనంలో ఎన్నెన్ని తమాషాలతో భాష-భావం-సంస్కృతి జీవించిందో తెలుస్తుంది. అందుకే ఈ గ్రంథాలను విశ్వవిద్యాలయాలలో మాష్టర్ డిగ్రీ చదివేవారికి కూడా ఒక ప్రశ్నాపత్రాన్ని పెట్టి ఉన్నారు.

నిరక్షరాస్యులకు ఏ గ్రంథమూ పనికిరాదు. ఒక్క మన ఆంధ్రదేశంలో నివసించే తెలుగు మాతృభాషగల జనానికే (25%)

పాతిక శాతం విడిచిపెడితే మిగతావారికి గ్రంథాలు పనికిమాలినవై నిరుపయోగంగా ఉన్నాయి.

దేశంలో చిన్నా పెద్ద అందరూ అక్షరాస్యులు కావడానికి ప్రయత్నాలు విరివిగా జరగాలె. తత్ప్రయత్నంలో కవిత చాలా ఉపయోగకారి కాగలదు. ప్రారంభదశ పదాలు నేర్వడం, పూర్ణదశ కవితను గ్రహించడం జరిగితే దేశం మూడుపూవు లారు కాయలుగా వర్ధిల్లకపోదు. "ఏది భాష - ఏది కవిత్వం - ఏది శాస్త్రం" అనేది ప్రతి వ్యక్తీ గ్రంథాలు చదివి నిర్ధరిస్తాడు; అందుకు ప్రయత్నిస్తాడు. కవిత అజరామయ మయింది. అది దైవస్వరూపం, లయాత్మకం అని నా నమ్మకం. వచన [గద్య] భిన్నత్వం కవిత్వం.

—★—

# కవితా రసోదయం

రసము పరమాత్మ స్వరూపమని ఋషి ముని కవి పుంగవులు వాకొన్నారు. ఆ రూపాన్ని అనుభవించే జీవులు పరమాత్మణ్ణి అనుభవిస్తున్నట్లుగానే చెప్పవచ్చునని దార్శనికులూ పండితులూ సెలవిచ్చినారు. ఆ రసాన్నే కొందరు కరుణమని, మరికొందరు శృంగారమని సాహిత్యలోకంలో భావించే అక్షరాస్యులు వాకొన్నారు. ఇంకా కొందరు ఆ రసం భీభత్స భయానక రౌద్రాది నవవిధనామాలలో విభాగ మవుతుందని చెప్పినారు. కరుణపట్ల మొగ్గు చూపినవారే అధికం. అందుకే భవభూత్యాదులు కరుణమే ప్రధానరసమని ఖచ్చితంగా చెప్పినారు. సంస్కృత ఉత్తర రామచరితలో ఆ రసస్వరూపాన్ని భవభూతి నిబద్ధించి రచించెనని దానికి ప్రతీకగా ఉత్తర రామచరిత నిలిపినాడని పండితులు చెప్పడం ఉన్నది.

ఆలిజగడం రామాయణమని, పాలి పంచాయతి భారతమని నావంటివారు ఈ కథలు విని ఒక్కొక్క మాటతోనే రామాయణ భారతాల సారాంశాల నిగ్గుతేల్చి చెప్పినారు. కథ చెప్పిన తీరులో కవిభావన వ్యక్త మవుతుందని, ఆ భావుకత్వంవల్లనే కవి వ్యక్త మవుతాడని బుధు లంటారు. అందుకే కవి ఈశ్వరాంశసంభూతుడని సర్వశాస్త్రజ్ఞులు అంగీకరించినారు. రచన తీరులో శబ్దాలంకారాలు, భావనలో అర్థాలంకారాలు ఒకదానికంటె ఒకటి మించి పరుగెత్తే ఊహలతో ఒకటి ముందుకు సాగిపోతుంది. ఈ ఊహయే కవిత కాత్మ. ఈ ఊహాశాలిత్వంలో ఆవిర్భవించే కవితా రసోదయం సమస్త జడజగత్తును చైతన్యదీప్తం చేస్తుంది.

కవి భావిస్తే చాలు ఆ ఊహ జగత్తులోకి వచ్చినట్లే. అందుకే కవులమనసు నొప్పించ రాదని బుధులు చెబుతుంటారు. ఈనాటి

సాహిత్యవీధుల్లో వ్యక్తులు పరస్పర వైరాలతో ఒకరినొకరు నిరసించు కునే దారిలో ప్రయాణిస్తున్నారేమో అన్నట్లు తోచింది. సృష్టి ఏక రూపంగా ఉండదు. వైవిధ్యంలోనే సాగిపోతుంది. వైరుధ్యం అందులో మొలకెత్తే అవకాశం లేకపోలేదు. రామాయణ భారతకథలను విని ఎవడో ''రామాయణం రంకు - భారతం బొంకు'' అన్నాడట. ఈ మాట జనంలో ప్రచారమై నేటికీ సామెతలలో ఈ సూక్తి నిల దొక్కుకున్నది.

అంత పెద్ద కథలను విని అసలు విషయ మేదో ఇంత చిన్న వాక్యాలలో చెప్పటం ఆ వ్యక్తి అవగాహన చేసుకున్నతీరుకు నిదర్శ నంగా ఆ మాట జనప్రచార మయింది. ఆ కథ లెట్లా చెప్పినా దన్న దానితో సంబంధ మేమీ లేదు. అందులో సమన్వయించిన శాస్త్రవైఖరు లతో కూడా సంబంధం లేకుండా ఎంత తేటతెల్లంగా ఈ మాట చెప్ప జాలెనో ఊహ కందని దేమీ కాదు.

అందుకే సోదికి అంత ప్రాముఖ్యమీయని వ్యక్తిత్వానికే ప్రాధా న్యత సిద్ధిస్తుంది. ఆ యా సందర్భాలలో జనం ''అసలు విషయానికి రా'' అనడం వింటాం. కవులు వర్ణించే సంగతులను దాటవేస్తూ ఈ గ్రంథంలో కవి చెప్పిన సంఘటన ఏది ? ఎందుకు ? అని ప్రశ్నించు కొని దీన్ని సూక్ష్మీకరించుకొంటాడు, ఆ సూక్ష్మీకరించుకొన్నదే సారంగా సమాజంలో ప్రభావానికి వస్తుంది.

భారతం కథ అంతా విని ఒక మహమ్మదీయుడు ''ఏక్ బుడ్డా ఏక్ లడ్కా'' అని చెప్పినాడట ఆ మొత్తం యుద్ధంలో చాలామంది యోధుల్ని వీరుల్ని సైన్యాన్ని చంపింది వీరిద్దరే అందుకే ఈ మాట అన్నాడు. అతనిమనస్సు యుద్ధసంబంధంగా ఆలోచించింది. వ్యక్తి వ్యక్తిలో ఒక రకమైన ఆసక్తి ఉంటుంది. ఆ ఆసక్తి కనుబంధంగానే తీసుకొనే నిర్ణయాలుకూడా ఉంటాయి ముక్కు తిమ్మనార్యుడు పారి

జాతాపహరణకావ్యం వ్రాసినాడు. అందులో ఆయన సత్యభామ కోపాన్ని వర్ణిస్తూ ''సేఱు వోయ భగ్గన దరికొన్న భీషణహుతాశన కీల'' అనంగ లేచి - అంటాడు. వ్యక్తి సంస్కారాది - ఆచరణాది సంబంధత్వాల్ని రచనవెంట తీసుకెళ్తుంది. ఇదే సంగతిని నిప్పునకు గాలి తోడైనట్లుగా చెప్పుకోవడం జనంలో చూస్తాం. ఎగేస్తున్నాడు అని కూడా అంటాం.

దాన్నే వైపరీత్యంలో తెనాలి రామకృష్ణుడు నిగమశర్మను గూర్చి చెప్పే సందర్భంలో ''ఉప్పన హోమాగ్ని నూద నొల్లడు గాని......విరహాగ్ని వెచ్చ నూర్చు'' అంటాడు. ఊదడం ఒగుల్లార్పే చర్య. 'కలహం రాజపెడుతున్నాడు' వంటి మాటలు - ఆ స్థితిని అతిశయింప చేస్తున్నాడు అనే అర్థంలో ఉపయోగమయినాయి. అయితే సందర్భాన్నిబట్టి ఆ కర్తల మనస్తత్వాలు భాషాపరంగా - భావన పరంగా అభివ్యక్తమవుతున్నాయి; ఈ దృష్టితో రచనలను పఠించేవారు తార్కికులు. సారజ్ఞులచేత ''కొంప అద్దంలో కొంచె''మైపోయిన విధంగా రచనాంశాలు నిలుస్తాయి. రచయితలు ఏ కేటగిరీకి చెందినవారో తేటపడతారు వారి ''తెలివితేటలు'' అక్కడ సువ్యక్తమవుతాయి.

ఈ సృష్టిలో స్త్రీపరంగా విస్తరించేది సాంఘికం. ధనపరంగా వ్యాప్తిపొందేది రాచరికం అని స్పష్టమవుతుంది. ఈ రెండూ చరిత్రాంశాలే. ఈ చరిత్రకు సంఘటనలు ప్రాణం అవుతాయి. అవి శాఖలు శాఖలుగా విస్తరిస్తూపోతాయి అవే రామాయణ భారతకథలుగా దిద్దబడినట్లు—భావించుకోవచ్చును (అప్పటి చరిత్ర—క లు)

స్త్రీపురుష ప్రతీకలనుంచి - వయస్సు (యౌవనాన్ని) గ్రహిస్తే దానినుంచి ధర్మాధర్మాల పరస్పరపోరాటం అవిర్భవిస్తుంది. ఆ పోరులో సత్యానికి జయం, అసత్యానికి అపజయం కలుగుతుందని పెద్దలు చెబుతుంటారు. ఈ విషయం కృష్ణునిపాత్రద్వారా రచయిత చెప్పినాడు- రాముణ్ణి దిద్దినవాడు రచయితే - రావణుణ్ణి సృష్టించినవాడూ రచయి

త్రయే కదా! ఈ దృష్టితో చూస్తే కవి ఈ లోకాన్ని ఎట్లా నడిపిస్తు న్నాడో బోధపడకపోదు. ఈ భూమిలో సమస్తమూ మనిషే అంటే ఎవరికీ కోపం రానక్కరలేదు.

ఆ మనిషి రాజ్యాలు స్థాపించాడు - యుద్ధాలు చేశాడు - బౌద్ధాది ధర్మాలను నిలిపాడు. పంటలు పండించాడు. లోహాల్ని వెలికి తీశాడు. విమానాలు కనిపెట్టాడు-రాకెట్లతో ఊర్ధ్వగామియైనాడీనాడు - తనకేమీ లేనివాడై కూడా బికారిగా భిక్షకుడుగా దీనుడుగా హీనుడుగా హంతకు డుగా ఉన్నాడు. ఎందుకు జీవిస్తున్నాననే విరక్తిలో కూడా కొన సాగుతున్నాడు. ఈ చిత్రం కవిహృదయాన్ని ద్రవీభూతం చేస్తుంది. తన రచనలో ఈ దృశ్యం చోటు చేసుకోక తప్పనిదై ఆవిష్కరింప బడుతుంది. సమసమాజ జీవన ధ్యేయం కోసం ఏమి చేయాలో ఏం చెప్పాలోనని మధనపడతాడు కవి. కవికూడా మానవ ప్రతీకయే- కాకపోతే విశేష మానవ ప్రతీకగా కవిని కొనియాడుతాం.

భూమిలోని మనిషి జీవనంలో ఎన్నో పోరాటాలు-ఆరాటా లున్నాయి. ఇవి అన్నీ ధర్మాధర్మాల మధ్య ఊగిసలాడుతూ జీవులంత రించడం చూస్తున్న కవి-కొన్నిటిని చూడలేక ఆక్రోశిస్తాడు. కొన్ని టిని సమాదరిస్తాడు. సౌందర్యాన్నే ప్రచారం చేసేవాడొకడు. దాని వెనక ఉన్న 'పాటు' ఏదో దాన్ని ప్రచారం చేసేవాడొకడు.

సమాజ జీవన విధానాన్ని కళలు అభివ్యక్తం చేస్తాయి. తర తరాల సాహిత్యం ఆనాటి జీవన సరళిని పలుకుద్వారా ఆచారం ద్వారా వేషం ద్వారా సంఘటన ద్వారా వర్తమాన జీవనంలో సమాజానికి గుర్తులుగా రచనలు మిగిలి ప్రభావం చూపిస్తుంటాయి. రామాయణంలో సీత-భారతంలో ద్రౌపదికి వలెనే కృష్ణతులాభారంలో రుక్మిణీ సత్య భామలు నిలిచినట్లే వర్తమానాంధ్రభాషలో కొన్ని స్త్రీపాత్రలు సజీవమై సాహిత్యపథాన్ని మలుపు త్రిప్పినాయి. విశ్వనాథ 'కిన్నెరసాని', నండూరి 'యెంకి', నారాయణరెడ్డి 'లకుమ', గురజాడ 'బుచ్చెమ్మలు'

వంటివి చెప్పదగినవి. ఇట్లాంటివే కొన్ని పురుషపాత్రలు సాహితీ ప్రపంచంలో తెలుగునాట సజీవరూపాలుగా నిలిచిపోయినాయి. పాండురంగ మాహాత్మ్యంలో నిగమశర్మ - నిగమశర్మఅక్కపాత్రలు, ఆధునిక సాహిత్యంలో గిరీశం, కన్యాశుల్కం నాటకంలో ఒక పాత్ర. ఈనాటి చిత్రకారుడు నన్నయను తిక్కనను పోతనను ఊహాచిత్రాలుగా గీసి ఇచ్చేదానితో తృప్తిపడక ఏంచేస్తాడు.

నెల్లూరులో తిక్కన తిరునాళ్ళు, వరంగల్లులో పోతనోత్సవాలు రాజమండ్రిలో నన్నయ సభలు జరపడం ఆంధ్ర సాహిత్యానికి నూతనోత్సాహం ఆధునిక సంప్రదాయ రచయితలకు కవులకు-కళాకారులకు నయనపర్వం సంఘానికి మేలుకొలుపు ప్రభుత్వానికి విజయాభ్యుదయం అని చాటే ప్రచారాలు వేమనపై అభిమానమున్నవాళ్లు విని ఆయన ఉత్సవాన్ని ఎక్కడ జరుపవలెనో అని ఆలోచించుకోవడం సమస్య కానక్కరలేదు. ఆయనకుకూడా ఓ ప్రాంతాన్ని కేటాయించి తత్సంబంధమైన కొందరితో ఒక ఉత్సవం—ఒక సావనీరు వెలువరిస్తే ఆ తరవాతి కవులకు ఆయా ప్రాంతీయులు ఆయా కవుల పేర్లతో ఉత్సవాలు చేసుకోవడం సముచితమైన చర్యగానే భావించుకోవలసి వస్తుంది. జాతీయ సమైక్యం పేరుతో సాగే వేర్పాటు ధోరణులు చాలారంగాలలో గుర్తించబడుతున్నట్లే ఈ సాహిత్యలోకంలో కూడా ఆ ధోరణి వచ్చేసింది. ఇది అంత ఆరోగ్యకరమైన లక్షణంగా లక్ష్యంగా తోచటంలేదు కనీసం, ఆ య్యకు పుట్టిన బిడ్డలే ఒక్కటి కాకుంటే ఇదేం బాగు, అని నాబోటి వ్యక్తి ప్రశ్నిస్తే ఏం చెప్పగలం. తెలుగు ప్రాంతంలో-కులం పనిచేస్తున్నది. వర్గం పనిచేస్తున్నది. ప్రతిభ సమాధిలోకి తొక్కబడుతుంది. సారస్వత సంఘాలు ప్రక్రియా వైరుధ్యంలో వేరైపోతున్నాయి. సంప్రదాయం పేరుతో కొన్ని-తిరుగుబాటు పేరుతో కొన్ని ఏర్పడ్డ సాహిత్య సంఘాలు-సమాజాలు జ్ఞానసంస్కార లక్ష్యం లేనివైనట్లుగా సాగుతున్నాయి. కవుల్ని-రచయితల్ని పోషించే లక్ష్యంలో ఏర్పడ్డ సంఘాలు ప్రభుత్వ ధన సహా

యాలు పొంది కొందరిని అవమానపర్చడం కొందరిని అదేపనిగా పోగుచేయడం పెట్టుకొన్న ఈ సంస్థలేం చేస్తాయో ఇంకా చూస్తూపోవలసే వస్తుంది. ప్రజల సౌకర్యంకోసం ఏర్పడ్డ కార్యాలయాలు-అవినీతికి ఆలవాలమైపోతున్నట్లు గుర్తిస్తున్న రాచకీయ శక్తులు సంస్కరించలేక పోవడంకూడా చూస్తున్నాము.

ఈనాటి రచయితకు ఇతివృత్తాల దారిద్ర్యం-దాస్యం-వ్యభిచారం-ద్రోహం-కుట్ర - సురాపానం-హత్య ఇత్యాదులు సమస్యలైన ఆచారాలై కూర్చున్నాయి, తానూ సమాజంలో సంఘంలో దోపిడికి మోసానికి గురి అవుతూనే ఉన్నాడు. వ్యక్తిత్వం బతికి బట్ట గట్టుటలేదన్నది తెలుస్తున్నా చేయగలిగేదేమి? అనే ప్రశ్న ప్రశ్నగా సాగిపోతూనే ఉంది. ఈ దేశానికిసాంస్కృతిక విప్లవం అవసరమయింది. సమాజాన్ని మేల్కొల్పేదే రచన. దారితో నడిపించేదే ప్రభుత్వం. అన్యాయాల్ని శిక్షించేదే న్యాయస్థానం-ఆయితేం ప్రయోజనం ఆకలి-కామం-దురహంకారం-మోసం-కుట్ర-దగా మనుషులమధ్య నక్కలై తిరుగుతున్నాయి. అవే జీవిస్తూ పెంపొందుతున్నాయి. అందరికీ కావలసింది డబ్బు-డబ్బు-డబ్బు. ఈ డబ్బు ఒక్కోచోట కోట్లకు మూలుగుతుంది. ఒక్కోచోట రిక్తహస్తమై వీధిపాలై అడుక్కుంటుంది. 'అదృష్ట' ప్రయోగంలో ఈ వ్యవస్థ కొనసాగుతుంది. ఆ అదృష్టానికి కళంకం తెచ్చిపెట్టింది. ఏంచేస్తాం అదృష్టాన్ని కాదనలేము. సిద్ధాంతం ఉన్నది నిజమే-అది అమలులో ఏమవుతుందో చూడండి! ఇది ఆధునిక గ్రంథకర్తకు వస్తువు కావడంలేదా? అమలుకాని వాగ్దానాలు ఎన్ని-? విద్యాలయాలు నిరుద్యోగుల్ని ప్రోగుచేసినాయి. వ్యవసాయ వృత్తులు దుర్భరమయినాయి. జనం దినదినం కూలికి వాపోయి-చెబుతున్నది చేస్తున్నారు. ఈ దుర్దశను అంతం చేయగల బలవంతులు జ్ఞానులు సమాజంలో పుట్టవలసి వచ్చింది. అబలల జీవనంలో ఆర్తి నిలదొక్కుకున్నది.

సినిమా పాటలు-భజన కీర్తనలు - భక్తసమాజాలు-సాహిత్య సంఘాలు తోచినమేర జనం దౌర్బల్యాలను సొమ్ముచేసుకొంటున్నాయి. సంఘాలు చందాల సేకరణలో నిమగ్నమయినాయి. అభ్యుదయం పేరుతో అరాచకం రాజ్యం చేస్తున్నదా అన్నట్లు సమాజం కనపడు తుంది. కవితా రసోదయంలో ఇవి అన్నీ ఈదులడుతున్నాయి. మునిగేది ఏదో తేలేది ఏదో చూడవలసి ఉంది. ఎన్నెన్నో వాదాలు ధర్మాన్ని కొలుస్తున్నాయి. ఇప్పటికి అదెంత పొంపుందో నిడివి ఉందో తేలలేదు. అయినా మొండిగా కళలు సమాజాన్ని సంస్కరించ వలెనని చూస్తున్నందుకు హర్షించాలె. కవితా రసోదయంలో అగు పిస్తున్న అవకతవకలెన్నో లెక్క దొరకనివైనాయి.

భూమిమీద సాక్షాత్ దైవవిలాసం గల దొక కవిత్వమే అని నా దర్శనంలో తోచింది. దివ్యానుభూతికి సత్యశాంత్యభ్యుదయ పురో గమనాలకు మానవ జీవన కల్యాణానందాలకు కవిత్వం పట్టుగొమ్మ. ఈ కవిత్వం భావవైఖరులలో ప్రఫుల్లవించి శబ్దసంపర్కమై లోకంలో అవతరిస్తుంది. ఇది లయాత్మకము. లయగలదానికి ఏగతిలో లయం లేదు. దానికి లింగభేదం లేదు. జాతివైరుధ్యం అంతకంటే లేదు. అది విశ్వవై వేద్యమై ప్రకృతిలో అంతర్లీనమైపోతుంది. జీవారాధనలో సుఖదుఃఖాల నధిగమించి సుందరమై శివమై అలరారుతుంది. కవితా రాధన చేయగలిగిన సమాజమే సంస్కారమైనదిగా నాగరకమైనదిగా సంభావ్యమానమై యశోవిలాసంగా చరిత్ర సంతరించుకొంటుంది. అందుకే కవిత్వం స్వేచ్ఛలో ఆవిర్భవిస్తుంది. విశ్వవిహారం చేస్తుంది. రకరకాల భాషల్లోకి అది పరివర్తనం చెందుతుంది. కర్త ఎవ్వడన్న ప్రశ్నను కోల్పోయి అది సమకూర్చే కల్యాణంవల్లనే లోకం దానిని ఆరాధిస్తుంది. అందుకే కవికి సన్మానం జరుగుతుంది.

ప్రపంచంమీద భాషలెన్నో ప్రాదుర్భవించాయి. అన్ని భాషల్లో కవిత్వ ముదయిస్తుంది. భాషలో ప్రక్రియలెన్నో ఏర్పడినాయి. అన్ని

ప్రక్రియల్లోను మనం కవిత్వాన్నే సమాదరించాలె. భాషను గురించి సంభావించినప్పుడు మనకు తెలియవస్తున్న సంగతి ఇట్లా ఉన్నది. అది మొదట సైగలలోనుంచి పలుకుగా అవతరించింది. పలుకు పద రూపం దాల్చింది. పదం పాటగా మారి రకరకాల రాగ తాళ లయల్లో వ్యాప్తి గాంచింది. ఆ భాష లక్షణమైన పద్యరూపం దాల్చడానికి వేలయేండ్లు పట్టింది. కవిత్వమంటే పద్యం కాదు. పాట కాదు. గద్యం కాదు. దాని విషయంలో అనంతమైన నిర్వచనాలు చేయబడినాయి. అయినా అది ఏ నిర్వచనానికి పట్టుబడలేదు. భగవంతుడంటే ఇట్లా ఉండేవాడని ఎట్లా చెప్పలేమో కవిత్వమంటే ఇట్లా ఉండేదని కూడా మనం చెప్పలేకపోతాం. కవిత్వం చెప్పగలిగినవాడే కవి. అది గమనించి గ్రహించినవాడే పండితుడు. అట్టి కవిత్వంకోసం పరితపించేదే సమాజం. అట్టి సమాజాన్ని పరిపాలించేదే ప్రభుత్వం. అట్టి ప్రభుత్వాన్ని నిరంతరం సంస్కరించుకొంటూ కొనసాగేదే జాతి. అందుకే కవులకు జేలుఖానాలుగాని శిక్షలుగాని లేవు. కవిత్వాల కంతకంటే లేవు.

నూరు నవలలను వ్రాసినవాడుకాని, చదివినవాడుకాని భాషా సాహిత్య మర్మాలను గ్రహించనివాడైతే పద్యాన్ని చదవడం కూడా రాదు అతనికి. చదవడమే రానప్పుడు అందలి సొగసుల నెలా గ్రహిస్తాడు? ఇది ప్రశ్న-చక్కగా పద్యకావ్యాన్ని చదవగలిగినవాడు ఏరకమైన గద్యాన్నైనా చదివి అర్థం చేసుకోగలడు. పోతనగారి పద్యం కంటే గద్యమే కఠినమై కొన్నిచోట్ల చదవలేము కేవలం నవలలు-కథలు చదివి వ్రాయగలిగినవాడు పోతనగారి గద్యాన్ని చక్కగా చదవమనండి చూద్దాం-చేతకాదు. అట్లా చేతగాక పోతన గద్యాన్ని పద్యాన్ని నిర్లక్ష్యం చేసి మాట్లాడగలమా?

ఉప్పూ మిరపకాయ సర్వులకూ అవసరమే. నవలలు కథలూ అందరికీ అవసరమే. రత్నాల సంగతి చాలామందికి పట్టి ఉండదు.

వాటితో ఆకలి దప్పికలు తీరవని వాటిని వద్దని నిరసిస్తామా? అట్లాగే కవిత్వం గల పద్యాలను గద్యాలను మనం విడచిపెట్టలేము. అందులో సొగసైన భావరత్నాలుంటే శక్తిమేరకు గ్రహించి తీరుతాం. అదేజాతి చైతన్యానికి గీటురాయి. మనం దైవసన్నిభమైన-కవితాతత్త్వాన్నిపొంది భూమిమీద తరించాలె. స్వర్గనరకాల సంగతి చనిపోయిన తరవాత ఆలోచింతాం. బ్రతికి ఉంటే సుఖ సౌఖ్యాలు ఆనందాలు అనుభవించాలె. మనస్సు ప్రతి వ్యక్తికి కర్తయై మార్గదర్శక మవుతుంది. అందుకే ఆత్మబుద్ధిః సుఖంచైవ గురుబుద్ధి ర్విశేషతః పరబుద్ధి వినాశాయ స్త్రీ బుద్ధిః ప్రళయాంతకమ్, అని ఆర్యోక్తి. మనోజయంతు మాండవ్యం, మాండవ్యుడు మనసు చెప్పినట్లు నడచుకొమ్మన్నాడు. మనసు చెప్పినట్లు నడచుకొని జీవించేదానికి ఆనందాలు కరతలామలకాలు కాక మానవు. శివార్పితమైన ఏ వస్తువుగానీ అది ప్రసాదమేకదా. దానిని లవలేశం పుచ్చుకొన్నా అందుండే ఎంతో శక్తి ప్రసరించి, వ్యక్తిని తరింపచేస్తుంది. ఈ భూమిమీద రెండు దశాబ్దాల ఈడుగల వ్యక్తు లంతా స్వతంత్రమైన జీవనమార్గాలు నిర్మించుకొనే అలవాట్లు రూపొందించుకొనకపోతే వారితరులకు భారమే గాక కొన్నిచోట్ల వారికి వారే భారంగా తయారయ్యే అవకాశమున్నది. వ్యక్తి స్వతస్సిద్ధుడు అయే దాక అతడు పరాధీనుడే. ఎన్నేండ్లు వస్తేం బుద్ధి వికసించక వచ్చిన పెత్తనం లోకానికి హానికరమన్న సంగతి గమనించినప్పుడే, ప్రతి వ్యక్తి తరించే సత్కర్మలను ఎన్నుకొని ఫలప్రదుడు అవుతాడు. అటు వంటి వ్యక్తులవల్ల సమాజం నిష్కళంకమైన జీవితం చేయగల్గుతుంది. తరతరాల భావి వారసత్వాలకు అక్షరస్వరూపమై వ్యక్తి పునాదిగా రూపొందుతాడు. గతం పునాదియైన మానవ జీవన మందిరంలో వర్తమానం ఆనందకరిమైన బ్రతుకు దీపమై అలరారవలెను. పిట్టకథలతో కాలక్షేపం చేసే దశ బాల్యం మాత్రమే. బాధ్యతలు గమనించే ఈడులో బరువులు మోయకపోతే ఆ వ్యక్తి సమాజానికి చీడగా తయారవుతాడు. కవితా రసోదయంలో నీరస చర్యలు పనికిరావు.

దాని కాంతికి కాలుష్యాలు హరింపబడతాయి. విశ్వమంగళమైన చైతన్యం జనంలో విస్తరిస్తుంది. శాంతిదాయకమైన వృత్తిజీవనం లభిస్తుంది. చక్కని ఆవర్యాలతో ప్రభుత్వాలు విధుల నిర్వర్తిస్తాయి. అందుకే ఈ కవితా రసోదయం ఆవిర్భవించింది. అఖిల జీవుల్ని ఆలరిస్తుంది. మనం చేస్తున్న మేళ్ల ద్వారా సమాజంలోని వ్యక్తులు సోమరులు, భిక్షకులు కారాదు. సృష్టించే సాహిత్యం ద్వారా కార్యోన్ముఖులైనప్పుడే కవితారసోదయానికి సార్థకత లభిస్తుంది బ్రతుకును సాధిస్తుంది.

ప్రతిభ, సౌందర్యం ధైర్యం కవితారసోదయంలో మూడు కిరణాలుగా సాగుతాయి, సమాజంలోని కదలికకు లక్ష్యాలవుతాయి.

—o—

# దేశోద్ధారక గ్రంథమాల

క్రీ. శ. 1938 అనగా బహుధాన్య సంవత్సరంలో శ్రీ వట్టికోట ఆళ్వార్‌స్వామిగారు కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి స్మారక చిహ్నంగా దేశోద్ధారక గ్రంథమాలను స్థాపించినారు.

స్వామిగారిని నేనెంత బాగా ఎరుగుదునో వారుకూడా నన్నంతగానే ఎరిగినవారు. వారి ఇల్లు సికింద్రాబాదు కింగ్స్వేకు దగ్గరలో ఉండేది. అది ఇల్లుకాదు భక్తులకు దేవాలయం, జ్ఞానార్జనులకు గ్రంథాలయం, సంఘసేవానురక్తులకు ఆదర్శ నిలయంలా ఉండి ఎందరి సదాశయాలకో పుట్టినిల్లుగా ఉండేది. 1955-56 లో ఆయనదగ్గరకు ఎన్నోసార్లు వెళ్ళినాను. ఆయన రూపం సర్వజనాకర్షకమయింది. వాక్కు మల్లెల ఘుమాయింపును వెదజల్లేది. అఖండమైన ధైర్యం ఆయన డెందంలో గూడు కట్టింది. కేతవరపు రామకోటిశాస్త్రిగారు, మహబూబ్‌గారు ఆయన సేకరించిన గ్రంథాలయ మధువును జీర్ణించుకొని త్రేన్చినారు. కాళోజీ, వానమామలై వరదాచార్యులవంటి మహాకవు లెందరో వారింటిని పావనం చేయడం చూసినాను. ఆయన ఎక్కడకు వెళ్ళినా ఏ మీటింగులో ప్రవేశించినా నోటుబుక్కు పెన్ను హేండ్ బ్యాగునుంచి తీసి అక్కడి విశేషాలను అక్షరాత్మకం చేసుకొనేవారు. ఆ సంచిలో ముద్రిత గ్రంథాలు బిల్లుపుస్తకం కరపత్రాలుండేవి. ఆయన వంటరిగా ఉండలేదు. తనచుట్టూ పదిమంది. పదిమందిలో తాను ఉన్నాడు. ఆయన ఎన్నో కవిసమ్మేళనాల్లో పాల్గొన్నాడు.

ఈ గ్రంథమాల ద్వారా ప్రసిద్ధ రచయితల గ్రంథాల నెన్నో ముద్రించినారు. పదిరూపాయలు గ్రంథమాలకు చందా పుచ్చుకొని పదకొండు రూపాయల నాలుగుఅణాల విలువగల గ్రంథాలు క్రమంగా అందిచ్చేవారు.

కథలు, నాటికలు, కావ్యాలు, వ్యాసాలు, జీవితచరిత్రలువంటి వెన్నో గ్రంథాలు ముద్రించినారు. ప్రతి ప్రచురణ పాఠకుల మన్నన లను పొందింది. పాఠకుల ఆసక్తిని ఇనుమడింపచేసింది. 1938 నుంచి 1941 వరకు 12 గ్రంథాలు వెలువరించినారు. ఈ కాలంలోనే అణా గ్రంథమాల అవతరించింది. అణా గ్రంథమాల స్థాపకులైన శ్రీ కె. సి. గుప్తగారు అళ్వారుస్వామిగారు ఒకే జైలులో ఒకే లక్ష్యంతో కమ్యూనిస్టు భావాలతో స్నేహం పెంచుకొన్నారు. గ్రంథ ప్రచురణ ప్రచారాలు వీరికి కొట్టిన పిండి.

## 1941 వరకు ప్రచురించిన గ్రంథాలు

హైందవ ధర్మవీరులు, ప్రాథమిక స్వత్వములు, గ్రంథాలయో ద్యమము, కమాల్‌పాషా జీవితము (2 భా.), ప్రజలు-ప్రభుత్వం, ఔంధు సంస్థానం, నా భారతదేశ యాత్ర (హెచ్. ఎన్. బ్రెయిల్స్ ఫర్డు), గాంధీమహాత్ముడు (2 భా.), కాంగ్రెసు సంస్థానాలు, సంస్థాన ప్రజల సమస్యలు.

1953 నుంచి మళ్ళీ కొన్ని గ్రంథాలు ప్రకటించినారు. తన దైన 1. జైలులోపల (కథానికలు), 2, కాళోజి నాగొడవ గేయాలు, 58 అఖిలాంధ్ర కవుల రచనలు 3, ఉదయ ఘంటలు (గేయాలు) తనదైన 4. ప్రజల మనిషి (నవల), నేదునూరి గంగాధరం సేకరించిన 5. సెలయేరు (జానపద గేయాలు).

15 మంది వ్రాసిన 15 ఏకాంకికలను 2 భాగాలుగా 6. జీవన రంగం పేరుతో ప్రకటించారు. 7. ప్రజలు-ప్రభుత్వం (వ్యాసాలు).

కౌంట్ లియో టాల్‌స్టాయికి అనువాదం-దాశరథి, 8. పునర్నవం (గేయాలు). 34 మంది కథకులు వ్రాసిన 34 కథలను రెండుభాగాలుగా 9. పరిసరాలు పేరుతో ప్రచురించినారు. 32 వ్యాసాలను 23 రచయితలు వ్రాసిన వాటిని 10. తెలంగాణం పేరుతో రెండు భాగాలుగా ప్రచురించినారు. పొట్లపల్లి రామారావు రచించిన గేయాలను 11. ఆత్మ వేదన పేరుతో ప్రచురించినారు.

అప్పటికే ఈ గ్రంథాలనుగూర్చి ఎన్నో పత్రికలు, సాహితీ మూర్తులు, రాజకీయ సాంఘిక నాయకులు చక్కని అభిప్రాయాలను అందించినారు. అందులో మాడపాటి హనుమంతరావుగారు, సురవరం ప్రతాపరెడ్డిగారు, కొండా వెంకట రంగారెడ్డిగారు, మందుముల రామ చంద్రరావుగారు, అయ్యదేవర కాళేశ్వరరావు లున్నారు. 1940 లో కాగడా, 56 లో ఆంధ్రపత్రిక విశాలాంధ్ర దినపత్రికలు, భారతి మాస పత్రిక, 1957 లో గోలకొండ దినపత్రిక, స్రవంతి మాసపత్రిక ఈ గ్రంథమాల ప్రచురణలను మెచ్చుకున్నాయి.

తెలంగాణం పేరుతో ఆదిరాజు వీరభద్రరావుగారు రచించిన గ్రంథాన్ని మూడవ భాగంగా వెలువరించినారు. దీనిలో ప్రాచీనాంధ్ర నగరాల సంగతి తేజస్వంతంగా చెప్పడం ఉన్నది. ఆదిరాజు వీరభద్ర రావుగారిని ఎరుగని చారిత్రకుడు సాహితీమూర్తి లేడనే చెప్పవచ్చును. సాహిత్య-చరిత్ర పరిశోధనలో తలమున్కలై కావించిన కృషి నిరుప మానమైనది. ఆయన వెలువరించిన గ్రంథాలలో మన తెలంగాణం, లలితకథావళి, రత్నప్రభ, జీవిత చరితావళి, జీవిత చరిత్రలు, నవ్వుల పువ్వులు, మిఠాయి చెట్టు, షితాబ్‌ఖాన్ వంటివి సుప్రసిద్ధమై ప్రచార మందున్నవి. ఈయన గ్రీకు పురాణ కథలెన్నో వ్రాసినారు. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు వీరభద్రరావు కలం గుర్రానికి చక్కని దాణా పెట్టినారు. వారింట్లో జరిపిన సాహిత్య కృషి శ్లాఘనీయ మయింది. నిరాడంబరమైన మూర్తిమత్వంతో అపరిమితమైన సాహిత్య

కృషి సల్పిన వీరి రచనల నెన్నిటినో ముద్రించుటకు నిశ్చయించు కొన్న ఆళ్వార్‌స్వామిగారు పోతన చరిత్రనుకూడా ప్రచురించవలెననే సంకల్పంలో సగానికి పైగా ముద్రించిరి.

ఆనాటి-దేశోద్ధారక గ్రంథమాల అడ్రస్ 2844.

ఇమాంబావి వీధి, సికింద్రాబాదు.

ప్రాచీనాంధ్ర నగర విశేషాలతో ఉన్న 'తెలంగాణం' 1950లో 1951లో ముద్రణలు పొందినది. 1950కి పూర్వమే ఆంధ్ర చంద్రికా గ్రంథమాల ద్వారా 'ప్రాచీనాంధ్ర నగరములు' పేర అచ్చు అయింది. ఈ తెలంగాణం అనే గ్రంథంలో అలంపుర కథనంతో బాటు ఆనెగొంది, కల్యాణి, కొండాపురం, కొలనుపాక, గోలకొండ పానుగల్లు (సల్లగొండది), ప్రతిష్ఠానము, భోనగిరి, రాచకొండ, వరంగల్లు, వేల్పుగొండ వంటి ప్రాచీనాంధ్ర నగరాల చరిత్రను కన్నులకు కట్టినట్లు అభివర్ణించినారు.

ఆళ్వార్ స్వామిగారు స్థాపించిన ఈ గ్రంథాలయం ద్వారా తెలుగు విజ్ఞానము భవిష్యత్ తెలుగు వారికి కూడా వెలుగునీయగలదై ఉన్నదనుట అతిశయోక్తి కాదు.

తెలంగాణం ప్రథమ భాగం వీరభద్రరావుగారు రచించినారు. దాన్ని కూడా దేశోద్ధారక గ్రంథమాలనే ప్రచురించినది. తెలంగాణ రెండవ భాగం మాత్రం తెలంగాణం గురించి బాగా తెలిసిన వారిచే వ్రాయబడిన వ్యాసాలివి. ఆంధ్రప్రదేశ్ అవతరణ సందర్భంలో 'తెలంగాణం పేర మనకందించిన ఆళ్వార్ స్వామి గారు ఈ సంపుటాల గురించి నాలుగు ముందు మాటలు వ్రాస్తూ ఇట్లా అన్నారు.

"తెలంగాణ ప్రాంతంగా వ్యవహరించబడుతున్న తొమ్మిది జిల్లా లలో చరిత్ర, శిల్పం, శాసనాలు, చిత్రలేఖనం, తాళపత్ర గ్రంథాలు,

తటాకాలు, కోటలు, వీరగాథలు—ఎన్నో ఉన్నాయి. సాహిత్యకారులు కళావేత్తలెందరో ఉన్నారు. అంతేగాక ఏండ్ల తరబడి దేశాన్ని తీర్చి దిద్దడానికి దేశాన్ని పురోగమింప చేయడానికి ఎడతెగకుండా జరిపిన ఉద్యమాలున్నాయి. వీటన్నిటిని వ్యాసాల రూపంలో అందించాలన్న కోరిక కారణంగా ఈ గ్రంథం అవతరించింది" అని.

ఇందులో శీర్షికలు విషయాలు పేర్లైన తగినవిగా భావించి ఈ దిగువ నిస్తున్నాను 1. నిజాం రాష్ట్రంలోని ఆంధ్రులు, మాడపాటి హనుమంత రావు 2. తెలంగాణా రాజకీయోద్యమము—చరిత్ర, రావి నారాయణరెడ్డి, 3. పారిశ్రామిక కార్మికులు - గొబ్బూరు రామచంద్రరావు, 4. తెలంగాణా భూదానోద్యమం— చుండి జగన్నాథం 5 భూసంస్కరణలు- పల్లెర్ల హనుమంతరావు 6. కౌలుదారీ సమస్య-దేవులపల్లి వెంకటేశ్వర రావు, 7. భూసంస్కరణలు — కొమురగిరి సుందరరావు 8. స్థానిక స్వపరిపాలనవిధానం— సి. రామిరెడ్డి 9. తెలంగాణ అంచలి కుటీర పరిశ్రమలు- డా. ఆర్. వి. రావుగారు, 10. చేనేత పరిశ్రమ- శ్రీ పెండెం వాసుదేవ్. 11. విశాలాంధ్ర ప్రజాఉద్యమం - మాదిరాజు సీతారామారావు 12. తెలంగాణాలో రాజకీయోద్యమాలు -కోదాటి నారాయణరావు, 13. బొగ్గుగనులు- ఎస్. సోమరాజు. ఈ గ్రంథప్రచురణ సందర్భంలో మా ఊరైన దేవరకొండకు ఆళ్వార్ స్వామి గారు వచ్చినారు. నేను అక్కడి ప్రముఖులకు పరిచయం చేయడంతోపాటు గ్రంథమాలకు సభ్యులను చేర్పించినాను. కొందరిచే ప్రత్యేకంగా విరాళలిప్పించినాను. ఆళ్వార్ స్వామి గారు హైదరాబాదునుంచి నాకు ధన్యవాదాలు తెలిపే ఉత్తరం వ్రాసినారు. నా సాహిత్య రజతోత్సవ సంచికలో దాన్ని ముద్రించినాను.

ఆళ్వార్ స్వామిగారు ఎంతో శాంతంగా ఉండేవారు. లోన నెంతో ఆవేశం ఉండేది. అది మాటల్లో అభివ్యక్తమయ్యేది. ఆయన మీద గాంధి వంటి మహనీయుల ప్రభావాలున్నాయి. ఆళ్వార్ స్వామి

గారు చేపట్టిన ఈ గ్రంథమాలోద్యమం తెలంగాణా ప్రాంతం ప్రజల్ని ఉత్తేజితుల్ని చేయుట మేగాక ఉద్యమోన్ముఖుల్ని చేసింది. దేశభక్తి విద్యాసక్తి, సాంఘిక సేవ, స్వాతంత్ర్యేచ్ఛను పెంపొందించడమే గాక తెలుగు పూర్వ వైభవ ప్రాభవ వీరగాథల్ని బంగారు బాటలుగా మలచి భావితరాలకు ఈ గ్రంథం చెరగని తరగని ఆస్తిగా మిగిల్చినారనే చెప్పాలె.

అళ్వార్ స్వామిగారు 'ప్రజల మనిషి' నవలా నిర్మాణంతో సాహిత్యలోకానికి సుపరిచితులే. నల్లగొండ జిల్లాలోని మాధవరం గ్రామానికి చెందినవారు. స్వయంకృషితో తెలుగూ, ఉర్దూ భాషల్లో పరిజ్ఞానం సంపాదించినారు. చాలాకాలం గోల్కొండ పత్రికలో పని చేసినారు, ఆంధ్ర మహాసభోత్సవాలలో పాల్గొన్నారు. తెలంగాణ పోరాటంలో పాల్గొన్నారు. జైళ్లు, లాఠీలు, నిర్బంధకాండ రుచి చూసినారు. 'తెలుగు తల్లి'' మాసపత్రికకు సంపాదకునిగా ఉన్నారు. 'జైలు లోపల' అనే కథాసంపుటిని ప్రకటించినారు. తెలంగాణ పోరాటం-తెలుగుజన జీవితం తెలిపే 'గంగు'ను ప్రకటించకుండా స్వర్గధామం చేరినాడు. అభ్యుదయ రచయితల సంఘంలో అగ్రగామిగా సేవలందించిన ప్రజా సేవకుడు.

సురవరం ప్రతాపరెడ్డి గారు గోలకొండ పత్రికద్వారా బహుముఖ సాహిత్య సేవలందించినారు. గోలకొండ కవులసంచిక నందించినారు. తెలంగాణంలో ప్రతాపరెడ్డిగారు, కె. సి. గుప్త గారు, అళ్వార్ స్వామిగారు గ్రంథకర్తలైన కవులకు, రచయితలకు కళాకారులకు, మార్గదర్శకు లయినారనుట అతిశయోక్తి కాదు. వారి మూలంగా ఎన్నో గ్రంథాలు అచ్చుకావడమే గాక తెలుగుజాతి జాగృతమయింది. అందుకు నా యీ చిరు వ్యాసం దేశోద్ధారక గ్రంథమాల స్మృతికి నూలుపోగుగా ఉండనీ అన్న ఆశతో_ముగిస్తున్నాను.

★

# పురోగామి - తిరోగామి

జ్ఞానధనులైన మానవులకు ప్రకృతి మహా గ్రంథమవుతుంది. ప్రకృతినుంచి ఎంతో విజ్ఞానం సమార్జిస్తారు. దాన్ని జ్ఞాపకం పుటల్లో భద్రపరచు కొంటారు. పరస్పరం వస్తు ద్రవ్యాల మధ్య జరిగే సంఘర్షణల మధ్య రూపొందే పరిస్థితుల్ని అనుభవాలతో కొలుచుకొని మంగళప్రదమైన జీవనానికి ఉపయుక్తమయ్యే విధంగా బహిర్గతం చేయడంలో జ్ఞానులు పరిసరాలను ఆశ్రయిస్తారు. ప్రకృతికి అనంత కాల చరిత్ర ఉన్నది. వర్తమాన జీవనానికి ఉపయోగమయ్యే సంఘటనలను ఉదాహరించుకొనడానికి వాటి అవశేషాలను గుర్తిస్తారు. ఉదాహరణకు నేటి మానవుడు విమానాన్ని, హెలీకాప్టరునూ ఉపయోగంలోకి తెచ్చుకున్నాడు. దూరాలను చేరువలో తెచ్చుకోవడానికి వీలుగా వాటిని ఉపయోగిస్తున్నాడు.

ఆ విమాన చరిత్రకు ఎన్నో ఆధారాలు ప్రకృతిలో లభిస్తాయి.

1. మేఘాలు ఆకాశంలో విహరిస్తాయి. సంకోచ వ్యాకోచాలు వాటికున్నాయి. అవి గాలివాటంగా ప్రయాణిస్తాయని గ్రహిస్తాము.

2. తేలిక వస్తువులన్నీ గాలివాటంగా పైకి లేస్తుంటాయి. ఉదా :- దుమ్ము-ధూళి, బూడిద, చిత్తు కాగితాలు-ఎండు టాకులు వంటివెన్నో చెప్పవచ్చు.

3. పక్షులు ఎగురుతూ ప్రయాణం చేస్తుంటాయి. పావురాలు లేఖల్ని తీసుక వెళ్ళే శిక్షణ లిచ్చిన దాఖలాలున్నాయి. హంసలూ-చిలుకలూ రాయబారాలు నడిపినాయి.

4. దేవాలయాలలో మానవాకృతి గల బొమ్మలను రెక్కలు

న్నట్లు చూస్తాం. గంధర్వులకూ, దేవతలకూ రెక్కలు న్నట్లు బొమ్మల్లో చూస్తుంటాం.

5. నారదుడు గగన విహారి.

6. రావణుడు గగనంలో విహరిస్తున్నప్పుడు రంభ ఎదురు పడుతుంది. కామోద్రిక్తుడై ఆమెను బలాత్కారం చేస్తాడు. రంభ వరుసలను ఏకరువు పెడుతుంది. వేశ్యలకు వరుస లేమిటి? అని కామాన్ని చల్లార్చుకుంటాడు. కంకంటి రామాయణం ఈ విషయాన్ని చాటుతుంది.

7. గరుత్మంతుడు విష్ణుమూర్తి సము. చిలుక మన్మధు నికి వాహనము. హంస బ్రహ్మదేవునికి వాహనము.

8. గుట్టలకు మహాపర్వతాలకు ఆదికాలంలో రెక్కలుండేవని ఇంద్రుడు వజ్రాయుధం ద్వారా వాటిరెక్కల్ని ఖండించి నాడని పురాణాలు వాకొంటున్నాయి

9. వినాయకునకు ఎలుక, కుమారస్వామికి నెమలి. శివునకు ఎద్దు, ఇంద్రునకు ఐరావతము, ఇట్లా రకరకాల దేవతలకు రకరకాల వాహనాలు ఉన్నాయి. రెక్క జాతి వాహనాలు లేచినవంటే అర్థంఉన్నది. యమధర్మరాజు దున్న పోతును వాహనంగా చేసుకొన్నాడు. సావిత్రి తన భర్త ప్రాణాలను కాపాడి, తిరిగి ఈయమని వెంటబడినప్పుడు ఆకాశంలోకి ఆమె ఏఆధారంతో ఎగిరిందో యమధర్మరాజును నిలదీయ గలిగిందో ఊహకందదు.

10. గుర్రాలకు కూడా రెక్కలున్నట్లు బొమ్మలను చూడటం ఉన్నది.

11. ఐచ్ఛిక రూపం-ఐచ్ఛిక గమనం దేవతలకున్నట్లు దానితో

పాటు దూరశ్రవణం - దూరదృష్టి (దర్శనం) వారికున్నట్లు పరకాయ ప్రవేశం కూడా చేయగలగడం - ఆదిశంకరుడు పరకాయ ప్రవేశం చేసి కామ విద్యను గడించి పోటీలో నెగ్గినట్లు చెప్పుకొనడం వింటూనే ఉన్నాం.

ఇన్ని అతీత విజ్ఞానాలార్జించిన పూర్వమానవులు విమానం తయారు చేసి రాముని కీయి కెట్లు టాయి. పుష్పకంలో ఎందరు కూర్చున్నా ఒకరికి సీటు ఖాళీగా ఏర్పడుతుందని వర్ణించడం ఉన్నది. అయితే ఇవి అన్నీ కథలే సుమా. నేటి మానవుడు విమానం చూస్తున్నాడు. దూర శ్రవణం రేడియో-టెలిఫోన్లు-తంతి సౌకర్యం కలిగి ఉన్నాడు. దూర దర్శన్ (టెలివిజన్) చూస్తున్నాడు. గ్రహాల మీదికి రాకెట్లు పంపుతున్నాడు. చంద్రమండలం మీద దిగి వచ్చిన భూలోక మానవుణ్ణి ప్రశంసించకెట్లా ఉంటాం.

మానవుడు భౌతిక విజ్ఞానంలో చాలా ముందుకు ప్రయాణించినాడు. టెస్ట్ ట్యూబులలో సంతానాన్ని సృష్టించి పెంచు తున్నాడు. నరుడు పురాణ వర్ణితమైన నారాయణుని ప్రతీకగా భూమి మీద ఎన్నో అద్భుతాలు ప్రదర్శిస్తున్నాడు. శాస్త్రీయ జ్ఞానం సర్వతోముఖంగా విస్తరిస్తుందనేది చూస్తూ ఎట్లా కాదనగలం? నిర్వివాదమైన విజ్ఞాన శాస్త్రం శాఖోప శాఖలుగా వృద్ధి పొందుతున్నది. ఆటం, హైడ్రోజన్, న్యూట్రాన్ వంటి బాంబులను సృష్టించినాడు. రథ,గజ,తురగాది సైన్యాలు, ట్రక్కులు-విమానాలు-టాంకులు ఉపయోగించడమేగాక సునిశితమైన బుద్ధి బలంతో అమోఘమైన అస్త్ర శస్త్రాలు(ఆయుధాలు) ఆధునిక మానవుడు సృష్టించినాడు.

భూమి మీద ఈ నాటికీ మానవుడు పేదతనాన్ని అజ్ఞానాన్ని-ఆకలిని-దుఃఖాన్ని రోగాల్ని అనుభవిస్తూ మరణం పాలవుతూనే ఉన్నాడు.

ఒక వైపు పురోగతి-మరో వైపు తిరోగతి తలచుకుంటే ఆనందమూ-దుఃఖమూ వ్యక్తిఅనుభవిస్తూ కాలం గడుపుతునే ఉన్నాడు.

కామాన్ని అనుభవించడానికి స్త్రీ పురుషులు అనుసరిస్తున్న వైవాహిక వినోదం-అప్పుడూ ఇప్పుడూ ఎన్నో రకాలుగా ఉన్నది. చూస్తూనే ఉన్నాం.

రామాయణంలో సీతా స్వయం వరం, భారతంలో రుక్మిణీ-సుభద్రా కల్యాణాలు, నేడు పేద మొదలుకొని ఉన్న వారి వరకు వివాహాలు కామాన్ని అనుభవించడానికి నిర్దేశించబడినాయి. వంశ వారసత్వం-ఆస్తి హక్కు--వారి వారి వేష భాషలు-ఆచారాలు సంగీత సాహిత్యాలు పరిపోషిత మవుతూనే ఉన్నాయి. గహనమైన విశేషాలెన్నో బహిర్గతం చేస్తున్న మానవుణ్ణి తలచుకొంటే మనసు ఉద్వేగ భాసితం కాకుండా ఉండే దెట్లు ? మనిషి నారాయణ ప్రతీకగా విశ్వ వ్యాప్తి పొంది మృత్యువును జయిస్తాడా అన్నట్లు సాగుతున్నాడు. విజయోస్తు.

—o—

''ఎవరు కవి యన్న మాట యీ యవనిమీద
తేలలే దింక ముందును తేలబోదు
ప్రతి ముఖంబున కవిత ప్రస్పందమందు
నది పురాకృత పుణ్యభాగ్యంబు లంది.''

# భారతీయుడు సృష్టించిన విమానం కథ

భారతీయ భాషలలో తల్లి వంటిదైన సంస్కృతంలో ముఖ్యంగా వాల్మీకి మహాకవి రచించిన రామాయణంలో పుష్పకవిమానం రాముడు ఎక్కినట్లు-ఉన్నది. అదేకాక 'రఘు వంశమ్'మహాకావ్యకర్త కాళిదాసు సూర్యవంశం చరిత్ర రచించడంతో తన తక్కువతనాన్ని చాటుకొన్నాడు: 'ప్రాంశులభ్యేఫలేలోభాత్-ఉద్బాహురివవామనః''అన్నాడు. ఈ రఘువంశమ్-లో దిలీపమహారాజు సూర్య మండలంవెళ్లి వస్తూ తోవలో ఉన్న ఇంద్రపురంలోగల కామధేనువుని పల్కరించక పోవడమేగాక పిలిచినను రథచక్ర ధ్వని వల్ల వినబడక భూమిని చేరడంవల్ల సంతానం లేనివాడై చివరకు గోసేవలో వంశాంకురాన్ని పొందినట్లు కథ నడవడం ఉన్నది. ఈ రథాల్ని విమానంసమానంగా వాడు కొన్నట్లు దానివల్ల గ్రహించవచ్చును.

ఇట్లా సంస్కృతగ్రంథాలలో విమాన పదం వాడబడినతీర్లు గమనించవచ్చును.

తేది 30-1-1983 ఆంధ్రభూమి దినపత్రికలో 'విమానసృష్టికర్త భారతీయుడే' అన్నఅంశంలో లఘువ్యాసం చదివినాను. ఈవ్యాసకర్త బుద్ధమురళి.

అమెరికాకు చెందిన రెట్ సోదరులు విమాననిర్మాణ కర్తలు ప్రధములని చెప్పుకోవడం ఉన్నా(17-12-1903) ఈతేదికిపూర్వమే భారతీయుడు విమానం తయారు చేసినాడని బొంబాయిలో ప్రయోగించినాడని తెలిపినాడు.

భరద్వాజమహర్షి రచించిన వైమానిక శాస్త్రం అనుసరించి ఈ భారతీయుడు విమానం తయారుచేసినట్లు ఉన్నది. అదేకాక 1952లో

మైసూరులోని అంతర్జాతీయ సంస్కృత పరిశోధనా సంస్థ డైరక్టర్ ఒక వైమానిక శాస్త్రం కనుగొన్నాడని అది భరద్వాజమహర్షిదేనని అందులో ఐదువేల సూత్రాలలో అధ్యాయాలు-ఉన్నట్లు కూడా తెలిపినారు. మంటల్లో సైతం కాలిపోని విమానాలు నిర్మించే పద్ధతులు కూడా చిత్రపటాలతోసహా సుందరకర్మ రుక్మి మూడురకాలు విమానాల తయారీని వివరించినట్లు చెప్పినాడు.

ఈ విషయం చూసినతదుపరి ఎప్పుడో ఎక్కడో విమానం కనిపెట్టినది మొదటివాడు భారతీయుడే అనేవ్యాసం చదివినది జ్ఞాపకం వచ్చింది. చాల పుస్తకాలు జ్ఞాపకం చేసుకోవలసి వచ్చింది. చివరకది పుస్తకం కాదు. వైశ్యదర్శిని అనే పేరుగల ప్రత్యేకసంచికలో. ఈ వ్యాసం సుప్రసిద్ధ కవిపండితుడు రాజనీతిజ్ఞుడైన ఎం.వి. పాపన్న గుప్త మదనపల్లివాస్తవ్యులు వ్రాసినారు. ఆ వ్యాసంలో మొట్టమొదట విమానం కనిపెట్టినవాడు శ్రీ యస్.వి. శ్రేష్ఠి అని ఆతని గురించి ఈ క్రింది విధంగా తెలిపినారు.

శ్రీ యస్.వి. శ్రేష్ఠిగారు కర్నాటకలోని పేదవైశ్య కుటుంబంలో జన్మించినాడు. సైన్స్ శాస్త్రంలో ఆరితేరి విదేశాలలో ఉన్నత పరీక్షలిచ్చి బహుమతులంది ఇంగ్లండులో ఓగ్బీ అనేపట్టణంలో ఒకకంపనీలో ఉద్యోగిగా ప్రవేశించి విమానమును తయారుచేసే విద్యగ్రహించి తానే తయారుచేసి నడిపి అనేక పతకాలను బహుమతులను పొందినారు. విదేశీయులచే ప్రశంసలందు కొన్న శ్రేష్ఠిగారి పేరు మరుగున పడిందని వాపోయి ఈవ్యాసంలో బాధపడినాడు.

శ్రీ యస్.వి. శ్రేష్ఠగారి చరిత్ర కన్నడంలో పండిత శ్రేష్ఠులు కన్నడభాషలో చక్కగా వ్రాసి ప్రకటించినారట.

మైసూరుమహారాజావారు విదేశాలనుంచి తిరిగి వచ్చిన శ్రేష్ఠిగారిని విమానం తయారుచేయమని కోరి అందుకు ఆంగ్ల ప్రభుత్వాన్ని

అనుమతించవలె నని కోరినారట. అనుమతించ లేదు. అయినా శ్రేష్ఠి గారు మోడల్ విమానాన్ని తయారు చేసి రాజు గారికి బహూమతిగా ఇచ్చినారట. అదిచాల చిన్నది. అదిఇప్పటికి మైసూరు మ్యూజీయంలో ఉన్నదట.

ఈఅంశాన్ని పరిశీలించ తగిందిగా శాస్త్రవేత్తలకు అవసరంగా భావించి మానవకళ్యాణానికి ఉపయోగ పడిన మహనీయులను సంస్మరించుకొనడం అవసరం. శ్రీ యస్. వి. శ్రేష్ఠిగారు గతించి వందసంవత్సరాలు అవుతుంది,

('వైశ్యదర్శిని' ఆధారంతో)

—o—

# ప్రసిద్ధ నృసింహ క్షేత్రాలు

విష్ణుమూర్తి దశావతారాలలో శ్రీ నృసింహావతారం ఒకటి. జీవ పరిణామదశను అభివ్యక్తీకరించే ప్రతీకలలో నృసింహావతారాన్ని మానవ రూపానికి పరిణామదశగా శాస్త్రజ్ఞులూహించడంకూడ సరిపెట్టుకునేపద్ధతిలో ఒకటి. దుష్టశిక్షణా-శిష్ట రక్షణ కర్తవ్యంగల దేవుడుగా ఈ అవతారానికి ప్రాముఖ్యం ఉన్నది. ఆర్య ద్రావిడ వింగడింపులకు కూడా ఈ అవతార ప్రతీకను ఉదహరించుకోవడం అక్కడక్కడ విజ్ఞులు అనుకోవడం విన్నాను. మానవులలో దేవదానవత్వాలు సమయకుండా ఉంటాయని-అందులో దానవత్వం ప్రకోపించినప్పుడు దైవత్వం వికసించి దానవత్వాన్ని అణచిపెట్టడం తప్పనిసరి అవుతుందని అనంతమైన ఆధారాలు చెబుతున్నాయి. ఈ అవతారమర్మము ప్రాచీనపురాణ ప్రసిద్ధమన్న సంగతి జగద్విదితము. ఆది శంకరుడు నృసింహ స్తోత్రం రచించినాడు. సంస్కృతవాఙ్మయంలో ఈ అవతారప్రాశస్త్యం కథాత్మకంగా స్తోత్రరత్నంగా ఉన్నది.

ముఖ్యంగా ఆంధ్రదేశంలో నృసింహపురాణ నిర్మాత, కవిత్రయంలో ఒకడైన ఎఱ్ఱాప్రగడను ఉదాహరించుకోకమానము. ఆతరువాత కవులెందరో ఆంధ్రదేశంలో గల నృసింహ క్షేత్రాల మహాత్మ్యాన్ని కొనియాడినవారున్నారు. పోతన భాగవతంలో సప్తమస్కంధాంతర్గతంగా ప్రహ్లాదచరిత్ర ఉన్నది. అందులో నృసింహావతారం ప్రస్తుతించబడింది. ఎందరోనాటకాలు-యక్షగానాలు, శతకాలు అనేకఛందస్సులలో రచించి ఈ నృసింహ-అవతారాన్ని కథలుగా, గాథలుగా బండ్లకెత్తినారు.

ఆంధ్రదేశంలో అతిముఖ్యమైన నృసింహ దేవాలయాలెన్నో ఉన్నాయి. అవి అన్నీ నిత్యపూజలతో, స్తుతులతో సేవించబడుతున్నాయి. పూజారహితములుగాని ఆలయాలలో నృసింహదేవాలయాలు చెప్పబడుతాయి. నృసింహ యంత్రం మహాశక్తి ప్రదమయింది. అది నిత్య పూజలతో శాంతించి సర్వశుభాలను మానవులకిస్తుంది.

ఆంధ్ర దేశంలో ప్రసిద్ధ నృసింహ క్షేత్రాలలో సింహాచలం, అహోబిలం, యాదగిరి, చిట్టియాల, చలిదొండ, పానకాల, వేదాద్రి, ధర్మపురి, అంతర్వేది, మూలశైల, నల్లపాడు వంటి పేర్లతో నరసింహస్వామి ఆలయాలున్నాయి. నృసింహస్వామి ఆలయాలు కొండలపైననే ఎక్కువగా ఉన్నాయి. పేరు పేరున ఆలయాల చరిత్రను వ్రాయడం ప్రస్తుతం సాధ్యంకాదు.

తెలుగు సాహిత్యంలో చాలా శతకాలు ఈ నరసింహస్వామి మకుటంతో విరాజిల్లినవి. ముఖ్యంగా ధర్మపురి నరసింహ స్వామిపై విల్పిన మకుటంగల నృసింహశతకం ఆంధ్రదేశంలో బహుళ ప్రచార ప్రయోజనం పొందినది.

భూషణ వికాస ! శ్రీ ధర్మపురి నివాస !
దుష్టసంహార ! నరసింహ ! దురితదూర !

ఈ నరసింహశతకంలోని పద్యాలురాని తెలుగుచదువరి లేడన్న అతిశయోక్తి కాదు. శిఖినారసింహ శతకం, వరాహనరసింహ శతకం, నృకేసరీశతకం, నరహరి శతకం, శ్రీ యాదగిరీంద్ర శతకం, శ్రీ యాదగిరీ స్తోత్రరత్నం, శ్రీ యాదగిరి లక్ష్మీ నృసింహ శతకం, మంగళాద్రి నృసింహ శతకం, లక్ష్మీ సుతుని నరహరి శతకం, శ్రీ మర్త్య కంఠీరవ శతకం, భువనగిరి నరసింహ శతకం, భక్త కల్ప ద్రుమ శతకం, ఘటికాచల నరసింహ శతకం, ఘటికాద్రి నరసింహ శతకం, నృసింహశతకం, ఏకప్రాసశ్రీమన్నరహరిశతకం, వరాహ నరహరి శతకం, ఈ రకంగా ఎన్నో శతకాలు తెలుగులో ఉన్నాయి.

ఘటికాచల మహాత్మ్యము కావ్యంగా వెలసింది. ప్రహ్లాద చరిత్రం పేర నృసింహ అవతారంపేర ఎన్నో యక్షగానాలు, వీధి నాటకాలు, నాటకాలు అచ్చయి ఉన్నాయి. రకరకాల తరజులలో కీర్తనలు, పాటలు తెలుగునాట వినిపిస్తాయి.

చెట్టు లెక్కగలవా ఓ నరహరి గుట్ట లెక్కగలవా
చెట్టులెక్కి ఆ చిటారుకొమ్మల చిగురు గోయగలవా?
చెట్టులెక్క గలనే ఓ చెంచిత గుట్టలెక్క గలనే
చెట్టులెక్కి ఆ చిటారు కొమ్మల చిగురుగోయగలనే !

అని ప్రశ్నోత్తరాల పద్ధతిలో సంవాద రూపంలో ఈ రకమైన జానపద వాణీలలో నరసింహస్వామి వృత్తాంతం చెప్పుకోవడం నేటికీ ప్రచార మందున్నది.

ఆంధ్ర రాజధాని కతి సమీప మందున్న యాదగిరి లక్ష్మీనృసింహ స్వామి అపార మహిమోపేతుడని చెప్పుకోవడం చూస్తూనే ఉన్నాము. పిలిచితే పలికేస్వామి అని ప్రచారంలో ఉన్నాడు. చాలా ప్రాశస్త్యంగల దేవుడు.

బి. కె. ఎస్. ఆచార్యులుగారు యాదగిరి నృసింహస్వామి క్షేత్రం విషయంలో కొంత పరిశీలించినారు. స్కాందపురాణంలోని మనోహర కాండంలో నారదాగస్త్యసంవాదంలో వర్ణింపబడి ఉన్నదా నినే, నైమిశారణ్యంలో సూత పౌరాణికుడు శౌనకాది మహామునులకు వివరించినట్లు మూల శ్లోకాలవలన విశద మవుతున్నట్లు వివరించినారు. దీనిలో 67 శ్లోకాలు ప్రథమాధ్యాయంలో, 48 శ్లోకాలు ద్వితీయా ధ్యాయంలో, తృతీయాధ్యాయంలో 45 శ్లోకాలు ఉన్నాయి.

వందే లక్ష్మీ నృసింహం, వనజభవ సూతం
వాంఛితార్థ ప్రదేయం, సింధూరాలంకృతాంగం
శివ వినుత తనుం శేషసింహాసనస్థం
గాంధర్వాదిత్యస్తుత్యం గరుడ సుగమనం
గాన విద్యా వినోదం, సౌందర్యాక్రాంతలోకం
శశిరవి నయనం యాదశైలాధినాథం

అని శ్రీ యాదగిరి లక్ష్మీ నృసింహ మహాత్మ్యంలో వర్ణితమయింది.

ఈ క్షేత్రంకూడా తిరుపతి, శ్రీ రంగము, శ్రీశైలము మొదలైన పురాణ ప్రశస్తి వహించిన ప్రాచీన పుణ్యక్షేత్రాలకు వలెనే మిక్కిలి ప్రాచీన మైనదనుట ఎవరికీ సందేహం రానక్కరలేదు. స్కాంద పురాణంలో దీని ప్రశస్తి ఉన్నదనటంతో ఇది ప్రాచీన క్షేత్రమని వేరే చెప్పడమెందుకు ?

యాద ఋషి వలన ఈ క్షేత్రానికి 'యాదగిరి' అనే పేరు సిద్ధించినది. ఈ యాదఋషి రామాయణ కాలంలో వశ్యభూతుడైన శ్రీ ఋష్యశృంగ మహామునికి కుమారుడు.

ఈ యాదఋషి మహా విష్ణువుని గురించి తపమొనర్చడానికి నిశ్చయించుకొని ఆతపస్సునకు అనువైన ప్రదేశమిది అని ఈ గిరిని ఎన్నుకొనడం జరిగినది.

శ్రీ లక్ష్మీ నరసింహస్వామి వెలసియున్న గుహయే పూర్వమా యాదఋషి నివసించిన ఆశ్రమము. చేతి గోళ్లతో గుండము నొకదానిని త్రవ్వెను. ఆ గుండమే నేడు మనకు కనిపించే స్వామి పుష్కరిణి. వేయి సంవత్సరాల తపస్సు ఫలితంగా నరహరి రూపంలో శ్రీమన్నారాయణుడు ఆ యాదఋషికి ప్రత్యక్షమైనాడు. ఆ రూపము తనను భయకంపితుని చేసినది. ప్రసన్నుడవై ఆదుకొమ్మని ప్రార్థించగా లక్ష్మీనృసింహాకృతిలో దర్శనమిచ్చినాడు. ఆనారాయణుడు అతనికి వరమిచ్చినాడు. జ్వాలా నరసింహ రూపము, యోగానంద నరసింహ రూపము, గండభేరుండ నరసింహ రూపము, ఈ మూడు రూపాలు దర్శించడానికి దివ్యదృష్టిని ప్రసాదించినాడు, యాదఋషి కోరిక మేరకు లక్ష్మీనరసింహస్వామి ఆ గిరియందే వసించి భక్తుల కష్టాలను తొలగిస్తు ఉన్నాడు.

:: ఫలశ్రుతి ::

1. యాదగిరి నామోచ్చారణతో సర్వపాపవిముక్తుడు అవుతాడు. 2. గుండమున స్నాన మొనర్చినవారికి గంగాస్నానఫలం సిద్ధిస్తుంది. 3. జప మొనర్చినచో అనంతపుణ్యం సిద్ధిస్తుంది. పితృదేవతలు సద్గతి పొందుతారు. 4. అర్థికి ఆ శిఖరంమీద భోజనం పెడితే వైకుంఠ ప్రాప్తి. 5. ఒకరాత్రి నిద్రిస్తే సర్వరోగ, సర్వదుఃఖ, సర్వపాప నివారణము అవుతుంది. 6. దీపారాధనమున అజ్ఞానము నశిస్తుంది. 7. కన్యాదానం చేస్తే కోటి కన్యాదాన పుణ్యఫలం సిద్ధిస్తుంది.

శ్లో॥ జయతు జయతు లక్ష్మీనారసింహ స్వరూపా
జయతు జయతు నిత్యో నిర్మలజ్ఞానవేద్యః!
జయతు జయతు దేవా దేవసంఘాభిపూజ్యః
జయతు జయతు యాదాద్రీశ భక్తౌఘబంధుః॥

ఈ రచనకు తోడ్పడిన గ్రంథాలు :

1. శ్రీ యాదగిరి లక్ష్మీనృసింహక్షేత్ర మాహాత్మ్యము
2. ఆంధ్ర శతకవాఙ్మయము.

★

# వేల్పుగొండ యోగానంద నరసింహస్వామి

ఈనాడీ వేల్పుగొండను "జఫర్ గడ్" అనే పేరుతో పిలుస్తున్నారు. దీనికే "విజానగరము" అనే మరోపేరు కూడా ఉన్నది. ఇది వరంగల్లు జిల్లాకు చెందినది.

వడ్డెరాజులకీ నగరము రాజధానిగా ఉన్నట్లు ఈ క్షేత్రము రాజకీయంగా ధార్మికంగా పూర్వవైభవాన్ని చాటుకొన్నదిగా చెప్పబడుతున్నది. ఈ జఫర్ గడ్ దుర్గమొక పర్వతరాజముపై ఉన్నది. అగస్త్యమహర్షి సేవించిన, పూజించిన సాలగ్రామమని ఈ పర్వతానికి ప్రశస్తి కలదు. దీనిమీద వడ్డె రాజులచే పశ్చిమ భాగంలో ఒకచోట శిలామయమయిన కోటకట్టబడినది. ఈ కొండమీద ఒక గుహలో యోగానంద నరసింహస్వామి వెలసినాడు. నరసింహాలయాన్ని అనుకొని పాదాల గుండము, కొంతదూరాన స్నానాల గుండములున్నాయి. ఈ యోగానంద నరసింహ స్వామి వారు రెండు జాముల వేళ స్నానంకోసం ఆ గుండంలో దూకుతాడని అప్పుడు చప్పుడవుతుందని జనం చెప్పుకుంటారు. ఈ క్షేత్రాన్ని పంచ నృసింహ క్షేత్రంగా పిలుస్తారు.

వీరనృసింహం, లక్ష్మీనృసింహం, సుప్రసన్ననృసింహం. కొండ సంగరప్ప నృసింహం వంటిపేర్లతో ఈ దేవుడు నాలుగువైపులలో వెలసినాడు. మధ్య యోగానందనృసింహుడు అలరారుతున్నాడు. కొండ మీద చాలా లోతైన జలాశయాలు, గుండాలున్నాయి. ఈ గుండాలలో ముఖ్యంగా చెప్పదగినవి అక్క చెల్లెండ్ల గుండాలు వీటితో బాటు

మానెగుండము పాల గుండములనేవి ప్రసిద్ధాలు. ఈ కోటగోడలు శిథిలమై ఉన్నవి. దీనిలో లక్కమేడ చాలా సుందరమయినది. వినాశ దేవతలపాలయి ఈ కొండనానుకొని వేల్పు గొండ పేరుతో గ్రామం ఉన్నది. ఈ గ్రామానికి నాలుగు దిక్కులలో నాలుగు ద్వారాలు కొయ్యతలుపులతో నిర్మాణములై ఉన్నవి. హనుమకొండ దర్వాజ పేరుతో పిలువబడే ద్వారం మంచి స్థితిలో ఉన్నది. ఈకొండ యోగానంద నారసింహస్వామికి ఆవాసమగుటచే, వేల్పుగొండ, పేరుతో ప్రసిద్ధమైనట్లు చెప్పవీలున్నది. చారిత్రిక మయిన ప్రదేశము.

తులసి గుండము-మణిగుండము అని అక్కచెల్లెండ్ల గుండాలకు పేర్లు. ఈఅక్కాచెల్లెండ్లు యోగానంద నృసింహస్వామిని ఆరాధిస్తూ తరించినారు. వేల్పుగొండ కోటకు జఫర్‌గడ్ అనేపేరు జఫరుద్దౌలాచే నిర్మిత మయిన కోటలోని భాగాలమూలంగ వచ్చినట్లు చెప్పుకోవడం ఉన్నది.

తూర్పున ఒక కొండ, పశ్చిమాననొకకొండ కలిగి మధ్యలో ఈ వేల్పుగొండ దుర్గం ఉన్నది. దీనిలో ఎన్నో రహస్య మార్గాలు న్నాయని అవి నేలబొయ్యారాలని ప్రతీతి. ఎక్కడ చూసినా నరసింహ స్వామి కొండ ప్రాంతాలలో గుహ ప్రాంతాలలో వెలసి లోకజీవులను కరుణిస్తూ దుష్టశిక్షణ-శిష్టరక్షణ కర్తవ్యంగా ఉన్నాడు.

> 'తిరుపతి' యన శ్రీపతియగు
> సిరిమగడన నానృసింహసింగారుండై
> వరలు ధరిత్రి విభుడై
> కరుణామయుడనగ సిరుల గాపాడుచొగిన్.

[ఉపయుక్త గ్రంథం : శ్రీ ఆదిరాజు వీరభద్రరావు
"తెలంగాణం" 3 వ భాగం.]

★ ★

# ఉందేల

# కవితా గాండీవం

బాల సరస్వతీ బిరుద విరాజితులు, సరస మనోజ్ఞ కవితా విలాసులు 'నేతాజీ', 'వివేకానందా'ది కృతి నిర్మాతలు—అయిన శ్రీ ఉందేల మాలకొండారెడ్డి గారు ఆంధ్ర సారస్వతావనిలో తళతళలాడే చుక్కలు దాకే విధంగా గుణాభిరామంగా పెరిగినారు. ఒకవైపు విద్యారంగంలో మరోవైపు సాహిత్య రంగంలో సవ్యసాచిత్వం నెరపజాలిన రెడ్డిగారు సాంఘిక జీవనరంగంలో విజయ భాస్కరులై వెలిగినారు. శ్రీ రెడ్డిగారి రచనలన్నిటినీ మూడు ప్రక్రియలుగా విభాగించి ఒకే సంపుటంగా వేయవలెననే నా సూచనకు తలాడించినవారేగాక మత్కృతికన్య 'చిద్విలాసాన్ని' ఇటీవలనే అంకితం పొందినారు.

'కవి కోకిల గ్రంథావళి' పేరుతో దువ్వూరి రామిరెడ్డిగారి కృతులు, అట్లాగే కృష్ణశాస్త్రిగారి కృతులు, దాశరథిగారి కృతులు, కుందుర్తి కృతులు ఉద్గ్రంథాలుగా అచ్చువేయబడినాయి. తద్విధంగానే మాలకొండారెడ్డిగారి కృతులు ఉద్గ్రంథంగా వస్తే ఇంక చెప్పేదేముంది. ఆయన చేపట్టిన ఇతివృత్తాలు—జ్ఞాన, వీర దయారమ్యములే గాక సాంఘిక జీవన కళారమ్యములుకూడా.

భారతావనిలో జ్ఞాననిధులై పుట్టి సర్వ ప్రపంచానికి జ్ఞానభిక్ష నందించిన వ్యాస—వాల్మీకి కాళిదాస భవభూత్యాదులేగాక ఆదిశంకరులు రామానుజుల వంటి మహోదాత్త ఉన్నత జ్ఞానకిశోరాలు జగదభిరామంగా ప్రకాశించారు. అట్టివారిలో వివేకానందులొకరు. హైందవ నాగరికత వైజ్ఞానిక జగత్తులో అత్యంత ప్రాచీనమై-గంగా ప్రవంతిలా చ్యుతి క్షతి లేనిదై అర్వాచీనమై ప్రాచీ-ప్రతీచీ సంస్కృతుల్ని సంస్కరించజాలినదై పర్వతాల్లో హిమాలయంగా జలాల్లో సముద్రంగా గోళాల్లో సూర్యుడుగా చుక్కల్లో ధ్రువశోభితమై భారతీయ విజ్ఞానం

భాసిస్తుందని ప్రపంచానికి నిర్భయంగా చాటిన మహనీయుడే వివేకానందుడు. ఆయనకు నచ్చనివి పిరికితనం-సంగనాచితనం-మోసం-కుట్ర-దగా-దౌర్బల్యం-నిర్దాక్షిణ్యం వంటి అజ్ఞాన దూషితాలైన దుష్ప్రవర్తనలు.

వివేకానందుడు మెచ్చిన జ్ఞానాంశాల్లో మొదటిది నిర్భయం-అఖండమయిన ధైర్యసాహసాలు-అప్రతిహత శక్తి-ఇనుప నరములు-ఉక్కు కండరాలు భారతదేశానికి ప్రస్తుత మవసరమని-సోమరితనం విడనాడాలని విధినియతిచేసి మానవుడు-"దుర్మార్గుడగుటకు విధియైనచో అపరిమిత దుర్మార్గుడవు కమ్ము! తత్త్వ సందర్శం చేయు దినములు వచ్చితీరును-నా వత్సలు పిరికిపంథలు కానేల దేశమునకు వీరులు కావలసిఉన్నారు అని పదే-పదే ఉద్ఘాటించిన వివేకానందుడు ఐహిక జీవనం పట్ల నిరాశానిస్పృహలు తగవన్నాడు. వివేక సూర్యోదయం-శంఖారవం చికాగో నగరోపన్యాసాలు-ప్రపంచానికిచ్చిన సందేశాలుగా ఎంచి తన కవితకు వస్తువుగా గ్రహించి "వివేకానందుడు" పేర అత్యంత బాల్యంలోనే కవితామయం చేసిన ఉందేల మాలకొండారెడ్డి భారత స్వాతంత్ర్య దీక్షను జన్మహక్కుగా నెంచి అసువులొడ్డిన వీర ప్రతాపాదులలో ప్రఖర తేజోనిధులై వెలిగిన సుభాష్ చంద్రబోసును ఆదర్శం చేసి అదేపేర కృతి నిర్మించిన మాల కొండారెడ్డిగారు కాంతి చక్రాల పేర ఖండకావ్యం రచించినారు. ఈ మూడు కృతులు అతని హృదయాన్ని-మేధస్సంబంధమయిన జ్ఞానాన్ని సాహిత్యపరంగా-శాస్త్ర పరంగా తెలియచెప్పడంలో తోడ్పడుతాయన్నది సత్యము. కూలంకష మయిన పాండిత్యంతోబాటు తేజస్వంతమయిన భావాలు-శబ్దార్థసంబంధ మయిన చమత్కారాలు ఆజన్మసిద్ధంగా తనలో తెచ్చుకొన్నవి వాటిద్వారా లోకాని కందించారా అన్నట్లున్నవి. నిర్మలత్వం నిరహంకారం ఇతరుల ఉపయోగార్థం అయినప్పుడే వాటికి గుణం కలుగుతుందికాని అన్నిచోట్ల అది సరిపెట్టబడదు. ఈయనకు ముఖ్యంగా దేశభక్తి,

భాసిస్తుందని ప్రపంచానికి నిర్భయంగా చాటిన మహనీయుడే వివేకానందుడు. ఆయనకు నచ్చనివి పిరికితనం-నంగనాచితనం-మోసం-కుట్ర-దగా-దౌర్బల్యం-నిర్దాక్షిణ్యం వంటి అజ్ఞాన దూషితాలైన దుష్ప్రవర్తనలు.

వివేకానందుడు మెచ్చిన జ్ఞానాంశాల్లో మొదటిది నిర్భయం-అఖండమయిన ధైర్యసాహసాలు-అప్రతిహత శక్తి-ఇనుప నరములు-ఉక్కు కండరాలు భారతదేశానికి ప్రస్తుత మవసరమని-సోమరితనం విడనాడాలని విధినియతిచేసి మానవుడు-"దుర్మార్గుడగుటకు విధియైనచో అపరిమిత దుర్మార్గుడవు కమ్ము! తత్త్వ సందర్శం చేయు దినములు వచ్చితీరును-నా వత్సలు పిరికిపంథలు కానేల దేశమునకు వీరులు కావలసిఉన్నారు అని పదే-పదే ఉద్ఘాటించిన వివేకానందుడు ఐహిక జీవనం పట్ల నిరాశానిస్పృహలు తగవన్నాడు. వివేక సూర్యోదయం-శంఖారవం చికాగో నగరోపన్యాసాలు - ప్రపంచానికిచ్చిన సందేశాలుగా ఎంచి తన కవితకు వస్తువుగా గ్రహించి "వివేకానందుడు" పేర అత్యంత బాల్యంలోనే కవితామయం చేసిన ఉండేల మాలకొండారెడ్డి భారత స్వాతంత్ర్య దీక్షను జన్మహక్కుగా నెంచి అసువులొడ్డిన వీర ప్రతాపాదులలో ప్రఖర తేజోనిధులై వెలిగిన సుభాష్ చంద్రబోసును ఆదర్శం చేసి అదేపేర కృతి నిర్మించిన మాల కొండారెడ్డిగారు కాంతి చక్రాల పేర ఖండకావ్యం రచించినారు. ఈ మూడు కృతులు అతని హృదయాన్ని-మేధస్సంబంధమయిన జ్ఞానాన్ని సాహిత్యపరంగా-శాస్త్ర పరంగా తెలియచెప్పడంలో తోడ్పడుతాయన్నది సత్యము. కూలంకష మయిన పాండిత్యంతోబాటు తేజస్వంతమయిన భావాలు-శబ్దార్థసంబంధ మయిన చమత్కారాలు ఆజన్మసిద్ధంగా తనలో తెచ్చుకొన్నవి వాటిద్వారా లోకాని కందించారా అన్నట్లున్నవి. నిర్మలత్వం నిరహంకారం ఇతరుల ఉపయోగార్థం అయినప్పుడే వాటికి గుణం కలుగుతుందికాని-అన్నిచోట్ల అది సరిపెట్టబడదు. ఈయనకు ముఖ్యంగా దేశభక్తి,

"వివేకానందుడు" కావ్యం గురించి—

"ఈ కృతిలోని కవిత పూతభావ సందీపితమై రసభరితమై వెలయుచున్నది. గంభీరభావ బంధురములై "సౌందర్య సంశోభితములైన వాక్కు" లెన్నో ప్రస్తుత గ్రంథమున కలవు."

—జొన్నలగడ్డ సత్యనారాయణ
1952.

"వివేకానందుని పవిత్ర చరిత్రమును బాలసరస్వతి ఉండేల మాల కొండారెడ్డి పద్యకృతిగా రచించి ఆంధ్రలోకమున కందించినాడు. ఈ గ్రంథమును నే నామూలాగ్రముగ పఠించితిని. నిరుపమాన కవితాధారతో, నిండియు నిండని ప్రాయమున "నేతాజీ" యుదంతమును రచించి నియంత లగు పెద్దల ఆశీర్వచనములకు పాత్రుడైన కవి కిశోర మీ బాలసరస్వతి. నేతాజీ కావ్యపఠనము వలన నెంతటి దేశాభిమానము హృదయమున నుద్దీప్త మగుచున్నదో అంతకంటె వేయిమడుగులుగా నాధ్యాత్మికోద్దీపన మీవివే కానంద కావ్యము పఠింపగా నలవడుచున్నది."

—నిడుదవోలు వేంకట్రావు
1952

"వివేకానంద కావ్యమును జూచితిని. నిర్దుష్టముగ నున్నది. చక్కని ధారాశుద్ధి కలదు. సంస్కృతసమాసములు గాని, తెలుగు రచనగాని కడు రమ్యముగా నున్నవి. వలసిన చోట వేదాంతము – పెరచోట్ల భక్తి చిక్కగా పోషింప బడినది. వీరిరచన హృదయంగమముగా నున్నది."

—విశ్వనాథ సత్యనారాయణ
10-12-1952

"వివేకానందుడు - అను గ్రంథమును నే నక్కడక్కడ జదివినాను. కవిత్వము నిర్దుష్టముగా, మృదుమధురముగా నున్నది. ఇట్టిగ్రంథములు లోకోపకారములని వ్రాక్రుచ్చు చున్నాను. ఈ కవికి బాలసరస్వతి బిరుదము చెల్లునని తోచినది.

— శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
12-12-1952

"శ్రీ ఉండేల మాలకొండారెడ్డిగారి - వివేకానందుడు - వీరి యుభయభాషా పాండితికి, భాషా సంప్రదాయాభిజ్ఞతకు తార్కాణముగా నున్నది. పద్యరచన ధారాళమై అడుగడుగున భక్తి రసస్ఫోరకము గన్నది. విద్యార్థిదశలోనే ఇంతటి రచనాపాటవము నలవరచుకున్న వీరి లేఖిని ప్రవర్ధమాన రచనలతో సుస్థిరకీర్తి సంపాదించుకొనగల దని నా విశ్వాసము.

— పిలకా గణపతిశాస్త్రి

"నేతాజీ, వివేకానందుడు - అనే పద్యకావ్యములు రెండును ఆమూలాగ్రము శ్రద్ధతో చదివినాను. ఒక్కొక్కపద్యము కడు హృద్యముగా ఉన్నందున రెండేసి మూడేసి సార్లు చదివి ఆనందించినాను. పింగళి సూరనామాత్యుడు శబ్ద సంస్కార మెచ్చటను జాఱనీక అనే పద్యములో సూచించిన ఉత్తమ కవితాలక్షణము వీరి రచనలలో గోచరించినవి. ఇంత చక్కని కవిత్వము లేబ్రాయమునందే యెట్లలవడినదో తెలియకున్నది. పూర్వజన్మసుకృత ఫలమా? ఇష్టదేవతా వరప్రసాదమా? కేవలము అసాధారణ కృషి ఫలమా? ఏదైనా ఎక్కువగా కొనియాడ తగిన విషయము."

— గిడుగు వేంకట సీతాపతి
11-2-1953

"ఈ కవిని రసమూర్తి యగు కవితాకన్య వలచినది. రస మయమగు కవితావస్తువు లభించినది. ఇంక లోప మెక్కడ? గంభీరభావనాపటిమలో 'కొడాలి'ని, మధుర మార్దవశైలిలో 'జంధ్యాల'ను స్మరింప చేయుచున్నాడు. కవితాస్రవంతిలో ఎగుడు దిగుడులు లేవు. అందందు నాధ్యాత్మిక భావనాశక్తి నవ్యకవితామాధురితోఁ గ్రొంజా యల నీనుచున్నది. కవి గొప్పవాడు కాగలడు. నవ్య కవితాపద్ధతుల నాకళింపు చేసికొనుటచేతనే కావ్యము స్వతంత్రముగా సాగినదని చెప్పవచ్చును. భాషాధ్యాయుల కిట్టి గ్రంథమెంతేని అవసరము.

— ఆదిభట్ల వేంకటరమణ

## నే తా జీ

[సుభాస్ చంద్రబోస్] కృతిపై కవి పండితుల అభిప్రాయములు.

కవికుమారా! ఆశీశ్శతములు.

"శ్రేయమునవే దివ్యకవితాఝరి నీలో నుద్భవించుట స్తవ నీయము. సింహపురి సీమ కవులలో గణనీయుడైన దువ్వూరి కోకిల లేనికొరత దీర్చగలరని ఆశించుచున్నాను."

— జి. జా షు వ
12-2-48

"నేతాజీ - చదివితిని. ఇంత చిన్నతనములో నింత చక్కని కవితాశక్తి నీ కలవడుట పూర్వజన్మ సుకృతము. చాల సంతోషించితిని. 'అభినవ జక్కనలు', 'సరస కవులు' విన్నారకనే ప్రశంసింతురా? నీ కవితా కన్యకు నా సర్వ మైన ఆశీస్సులు."

— విశ్వనాథ సత్యనారాయణ

"మహాకవి యెవరో మీ చాటున దాగియుండి యీ రచన చేసియుండు నన వీలులేదు. అట్టి కవి మీలోనే దాగియుండ బోలును. మీ వయసెంత ? మీ చదువెంత ? ఈ రచనా పరిణత మెట్టిది ! బళారె !

వేటూరి ప్రభాకర శాస్త్రి
24-2-48.

"నేతాజీ జీవితవిషయమున-ఆతని పునరాగమన ప్రత్యాశ విషయమున కవికుమారునితో నేకీభవించని భారతీయు లుండరు. ఇతనిద్వారా మన నెల్లూరు మండలము కవితా యశస్సునింకను వర్ధిల్లజేయుగాతమని సర్వశక్తిసమన్వితుడైన భగవానుని నిండుమనమున గొండాడుతున్నాను."

దుర్భా సుబ్రహ్మణ్యశర్మ
12-1-1948

ఆతరవాత కొంతిచక్రాల ఖండకావ్యం అచ్చు అయింది. దాని తరవాత 1981 లో మొగలిరేకులు ఖండకావ్య సంపుటి వచ్చింది. ఇది ఖండకావ్యయుగం. ఈ కావ్యవిషయంలో మహాకవి దాశరథిగారిట్లా అంటున్నారు. "సురభిళములైన మొగలిరేకులు చురుక్కున గుచ్చుకున్నట్లుంటుంది, ఉండేలు దెబ్బ గుండెల్లో తగిలినట్లు ఉంటుంది. మా మాలకొండారెడ్డి గారి కవిత చదువుతుంటే మర్మస్పృక్కులు-గా ఉన్న కవితలుగా తోస్తాయి. ప్రతిపద్యరసోదయం వీరి కవిత్వం.

దాశరథి
1981

సాహిత్యలక్ష్మి పురుడుబోసి ఉగ్గుబోసి రెడ్డిని బాలకవినిచేసి ప్రోదిచేసినది. 14వ ఏటనే 'నేతాజీ' కావ్యం వ్రాయించి యశోలక్ష్మి జీవితాన్ని నడుపుతున్నది.

మరుపూరు కోదండరామిరెడ్డి

"కావ్యవస్తు వత్యంతము పవిత్రమైనది. రచనానైపుణి సహజ సుందరమైనది. రసపిపాసువులకు కొరతలేని అమృతవాహిని ఈ కావ్యము. "చరిత్రకు బాహ్యసత్యము ప్రధానము. వివేకానందుని జీవితమునందలి రసస్ఫూర్జిత ములగు ఘట్టములను తీసుకొని హృదయంగమముగా దిద్దితీర్చి వివేకానంద ప్రతిబింబమును మనకు అందించినాడు. కావ్యములోని ఘట్టములన్నియు పేర్కొనవలసినవియే యుండును. ఎంత రమణీయముగా, రససంపన్నముగా, గంభీరముగా శబ్దార్థ సమానైక్య సంధాయకముగా రచింపబడినవో సహృదయులు గుర్తింపగలరు. కవి వయస్సున పిన్న. ప్రతిభావిశేషమున మిన్న.

దుర్భా రామమూర్తి

"భారతోద్ధారణార్థము పశ్చిమఖండములో భిక్షాటనము చేయుటకైనను నేను వెనుదీయను" అని ప్రతిన బూనిన వివేకానందుని పవిత్ర జీవితమును ఈ కవితతో చరితార్థత సమకూర్పగలదని నా యాశ.

ఉండేల మాలకొండారెడ్డి

జీవదయామండలి గౌరవకార్యదర్శిగా ఉన్న కర్రి అప్పారెడ్డి గారి కీ కృతి అంకితమైనది.

పదునాలుగవ ఏడు ఈడులోనే సుప్రసిద్ధ కవిగా సాహిత్య సుకవిలోక భీష్మాచార్యులచే మెప్పులు వడసిన మాలకొండారెడ్డి సాహిత్య జగత్తులో వ్యాసాంశంగా చదువుకోదగిన వ్యక్తిగా భావించి భావి సారస్వత విద్యార్థుల కీ వ్యాసం అందిస్తున్నాను.

ఆయన కవితా వైలక్షణ్యం నేనెరిగిన రీతిలో ఈక్రింద పొందు పరుస్తున్నాను.

## నేతాజీ నుంచి

ప్రతి నిమిషంబు కష్టములపైని కవా తొనరించు నీదు జీ
వితపు టెడారి మధ్యమున వేయి తుపానులు రేఁగి వీచె, న
ద్భుతముగఁ గార్యరంగమున దూఁకుటయే పని నిర్వహించుటే
వ్రతమగు నీ నిఘంటువున రాదు సుమా వెఱపన్న మాటయే.

కార్యరంగములో దూకటమే - పని నిర్వహించటమే వ్రతంగా పెట్టు కొన్న బోసు నిఘంటువులో వెఱపు అనే మాట వెదకి ప్రవేశించలేదని చెప్పడం యుక్తి ఉక్త్యలంకారమై లేదా? చాలు నీ ఒక్క పద్యం - ఒక కవిని ఒక పద్యం ద్వారానే ఛందము, అలంకారము, భాష, శయ్యాలిత్యాదులే కాక ఆతని ఆవేశం దానితో ఎట్లు అనుబంధమయినది - అది తనదయిన జీవిత స్వభావాన్ని కూడా బహిర్గతం చేస్తుందనేది వేరే చెప్పడం విజ్ఞతకు లక్షణం కాదని నా నమ్మకం. ఈ కావ్యం 1948 లో అచ్చు అయింది.

వివేకానందుడు కావ్యంలో నరేంద్రుని కష్టదశను వర్ణిస్తూ చెప్పిన పద్యంలో ఏర్పడిన వైరాగ్యం చూడండి:

"తప్పదు చావు దేహులకు, దానికి చింతిలనేల? ఆత్మకే
ముప్పు జనింప దంచు ధృతిఁబూని వచించుచుఁ దండ్రిచిత్యపై
నిప్పులు పోసి నిల్చుకొనె నిశ్చల నిస్పృహ నేత్రయుగ్మడై
గుప్పెడు బూది యస్థికలు గోచరమైనవి రుద్రభూమిలో."

రుద్రభూమిలో గుప్పెడు బూది, అస్తికలు మాత్రమే గోచర మయిన వట ! తండ్రిరూపాన్ని నిశ్చల నిస్పృహ నేత్రయుగ్ముడై చూచాడు. దేహాలకు చావు తప్పదని, ఆత్మకు చావులేదని తెలుసుకొన్నాడు. భగవద్గీత మొత్తం ఈ పద్యపాదంలో నిక్షేపిత మయింది.

ఈయన అరసున్నాలు, బండిరాలు ఎక్కడెక్కడ ఉంచాలో అక్కడక్కడ సరిగా పెట్టినాడు. ఈ కావ్యం విద్యార్థిలోకానికి గొప్ప జీవితాన్ని ప్రసాదించునని నా ఆశ. 1952 లో అచ్చు అయింది. ఆ తర వాత కాంతిచక్రాలు, ఆ తరవాత 1982 లో మొగలిరేకుల్లో గుబాళిం చిన ఈతని కవితాకాంతి ఘుమఘుమాయింపులు ఆంధ్రసారస్వత రసిక వీధుల్ని మధుర మంజుల మనోజ్ఞం చేశాయి

అచ్చమాంబా—ఓబులరెడ్డి దాంపత్య ప్రేమసరోవరంలో విరిసిన పద్మమా ? పద్మప్రియత్వమా అన, లబ్ధప్రతిష్ఠుడై భాసించిన శ్రీ మాల కొండారెడ్డి జననం 1932 లో ప్రకాశం జిల్లాలోని కనిగిరిలో జరిగింది.

1946 లో నేతాజీ కృతి నిర్మాణం చేశారు, (నెల్లూరులో ఉంది)

1949 లో ఎస్.ఎస్.ఎల్.సి.పబ్లిక్‌పరీక్షలో 600 మార్కులలో 508 సంపా దించి మద్రాసురాష్ట్రంలో ఆ తరగతి చదువులో ప్రప్రథము లుగా ఉత్తీర్ణులయినారు,

1949-51 న నెల్లూరు కాలేజీలో ఇంటర్ చదువుట.

1953 లో వివేకానందుడు — ప్రకటన.

1951-55 మదరాసు గిండీఇంజనీరింగుకాలేజీలో చదువు పూర్తి చేశారు.

1955-57 మధ్య పి. డబ్ల్యు. డి. శాఖలో ఉద్యోగం.

1957-81 మధ్య ఉస్మానియా యూనివర్సిటీలో లెక్చరర్‌పదవి. సరస్వతిని భార్యగా పొంది ఆమెయందు జయశ్రీని, రాజశ్రీని, ఉషశ్రీని, సంధ్యశ్రీని పండించి ఆ బిడ్డల మధ్య సానందంగా ఉన్నారు.

1959 లో కాంతిచక్రాలు ప్రకటించారు.

1961-79 లో ప్రాంతీయ ఇంజనీరింగ్ కళాశాల, వరంగల్లులో ఆచార్యుడుగా శిష్యకోటిని అలరించారు.

1861 లో వరంగల్లు సిద్ధార్థ నగరానికి మట్టి పెద్ద ఎత్తి తన గృహనిర్మాణకౌశలాన్ని ప్రకటించారు.

1974-77 లో మిత్రులతో కలిసి సిద్ధార్థహోటల్ నిర్మాణం, నాంపల్లిలో నందనం, పేరున శత గృహనిర్మాణం చేతులమీదుగా గావించి గృహస్థులకు సుఖావాసాలు సమకూర్చి ఆనందించారు.

1965-68 లో ప్రత్యేక ఉన్నత విద్యకు ఇంగ్లాండు చేరి ఆ సీమ చదువులో (Structural) ఇంజనీరింగుశాఖలో డాక్టరేటు[పి.హెచ్.డి] పట్టం పొందినారు.

1979 లో హైదరాబాదులో చైతన్య భారతి అనే ఇంజనీరింగు కళాశాల వ్యవస్థాపకత్వం - ప్రిన్సిపాల్ ఉద్యోగం - రెండూను.

1981 లో మొగలిరేకులు ఖండకావ్య ప్రచురణ.

1982 లో కవిరత్న శ్రీ నీలా జంగయ్యగారి కృతి "చిద్విలాసం"కు కృతిపతిత్వం.

ఈ కవి జీవిత చరిత్ర ధన్యము.

★★★

# తెలుగు తల్లికి క్రొత్త కానుక

ప్రియమిత్రులు శ్రీ నీలా జంగయ్యగారు రచించిన "కవితా రసోదయ"మను పేరుగల వ్యాససంపుటి యందలి వ్యాసములు పఠించి ఆనందించితిని. శ్రీ జంగయ్యగారు సంవత్సరమునకు రెండు మూడైనను గ్రంథములు వెలయించుచుందురు. ఊరక కాలమును వ్యర్థము చేయుట వారికి చేతకాని పని. వారు గద్య పద్యములు రెండింటను సిద్ధహస్తులు. నిజము చెప్పవలసినచో "మూపులు మూడగున్ రిపు చమూతతి చూచినయంత క్రీడికిన్" అనునట్లు వారు గేయరచనమునందుకూడ ఆరితేరినవారు. వా రిదివర కెన్నో పద్య గద్య గేయ కావ్యములను ప్రచురించియుండిరి. రసోదయమను నీ వ్యాససంపుటి వా రీయేడు తెలుగుసరస్వతికి సమర్పించు క్రొత్త కానుక.

ఈ వ్యాససంపుటము నందలి మొదటి వ్యాసమున భారత కల్పవృక్షము ఆంధ్రనందనములో నాటిన నన్నయగారి కవిత్వమునుగూర్చి వ్రాయబడినది. ఆదిఆంధ్రకవితావల్లరికి నూత్నవసంతకాలము. ఈ వ్యాసమున రాజరాజనరేంద్రుని గూర్చియు, నన్నయ కవిత్వమునందలి గుణములను గూర్చియు, నన్నయ ఉపయోగించిన మార్గదేశిచ్ఛందస్సులను గూర్చియు వివరింపబడినవి. నన్నయయు, పోతనయు తమ గ్రంథములను కల్పవృక్షములతో పోల్చియుండిరి. ఆ ఉపమానమే కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి శ్రీమద్రామాయణ కల్ప

వృక్షమునకు ప్రేరకమైనదని జంగయ్యగారు తెల్పిన భావ మెంతయు సముచితముగా నున్నది. విద్యాగంధ మను వ్యాసమున వీరు నిజమైన విద్య యేదియో స్థిరీకరించుచు అధునికకాలమున జరుగుచున్న అక్రమ ములను కూడ సూచించి ఉన్నారు. ఉత్తమ విద్యార్థికి సత్సాంగత్యము సద్గురు స్మరణ మానవున కతిముఖ్యము లని శ్రీ జంగయ్యగారి ఊహ. అభిమన్యుడు, ప్రహ్లాదుడు తల్లిగర్భమునం దున్నపుడే జ్ఞానపూర్ణులై విలసిల్లిరి. దౌష్ట్యము నణచిపెట్టజాలునదే విద్య అని వారు వెల్లడించిన భావము యథార్థము.

విశ్వంభర అనునది డా॥ సి. నారాయణరెడ్డిగారు రచించిన కొత్త గొప్ప వచనకావ్యము. దానిని ఆంధ్రదేశమునందలి సాహిత్య సంస్థలే గాక పరరాష్ట్ర పరదేశ సాహిత్య సంస్థలు కూడ గుర్తించి తగిన పారితోషికము లిచ్చినవి. వచనకవితలో వారందు వెలయించిన భావములు మహోదాత్తములుగా నున్నవి. అట్లే వారు వాడిన పదసము దాయము కూడ తెలుగు తనమునకు ఉనికిపట్టై శ్రవణపేయముగా నున్నది. ఆధునికమైన ఆ మహాకావ్యమును చదివిన తరవాత తమకు కలిగిన భావములను శ్రీ జంగయ్యగారు ఒక వ్యాసమున విశదీకరించి ఉన్నారు.

ముఖం చూసి బొట్టుపెట్టడం ఒక లోకోక్తి. దానికి వ్యంగ్యా ర్థము లనేకము లున్నవి. ఆ యర్థముల నన్నిటిని జంగయ్యగా రొక వ్యాసమున వివరించి ఉన్నారు. సాదుబొట్టు తయారుచేయు విధానముల వా రీ వ్యాసము చివర వ్యక్తముచేసి ఉన్నారు. మూలికావైద్యముపై వారికి గల ప్రత్యయ మిందు తెలియవచ్చుచున్నది.

ఆణా గ్రంథమాలోద్యమము, దేశోద్ధారక గ్రంథమాల అను రెండు వ్యాసములను శ్రీ కె. సి. గుప్తగారు, కీర్తిశేషులు వట్టికోట ఆళ్వారుస్వామిగారును చేసిన సారస్వత సేవను ప్రకటించువ్యాసములు. వా రిర్వురును ఆ గ్రంథమాలలలో పెక్కు గ్రంథములను ప్రచురించిరి. అవి దేశభక్తిని, దేశగౌరవమును ప్రకటించు గ్రంథములు. ఆళ్వారుస్వామిగారి "ప్రజల మనిషి" గొప్పనవలగా పేరు పొందినది. ఆయన "గంగు"అను నవల వ్రాయుటకు మొదలుపెట్టి దానిని ముగింపకుండగనే మృత్యువువాత బడుట విషాదకరమైన విషయము.

పశ్యమ్ కవిత్వ మను వ్యాసము రసోదయ మను ఈ వ్యాస సంపుటి నామమును సార్థకము చేయునట్టిది. నిజమునకు రసాత్మక మైన వాక్య మేదైనను కావ్యమే యగును, కాని, ఛందస్సహితమైన పద్యము కవిత్వమునకు అపూర్వమైన లయను కలిగించును. వచన కవిత్వమున ఇది లేకపోవుటచే ఎంతో సమర్థులు వ్రాసిన రచనలు కూడ లయహీనములై హృదయానందము కలిగింపక పోవుచున్నవి.

కవిత్వము అజరామర మైనదనియు దైవస్వరూప మైనదనియు లయాత్మక మైనదనియు శ్రీ జంగయ్యగారి అభిప్రాయము. కవితా రసోదయ మను వ్యాసము మిక్కిలి విలువైనది. దానినిబట్టియే ఈ సంపుటికి పేరు పెట్టబడినది. రస మెట్లుదయించునో, అది పఠితల కెట్లానందము కలిగించునో జంగయ్యగా రిందులో వివరించి ఉన్నారు. ఆధునికుల ధన కామ లోలత్వములు వారు నిరసించి ఉన్నారు. ఈ లోకమున దైవాంశము కలిగినది ఒక్క కవిత్వమే ననియు, కవితా రసోదయమునకు ప్రతిభా సౌందర్య ధైర్యములు మూడు కిరణము లనియు వారి అభిప్రాయము.

పురోగామి తిరోగామి అను వ్యాసము పురోగమన తిరోగమనము లను రెండును ఒకే సమయమున కలుగుచు ఎట్లు సంతోష విషాదములను కలిగించుచున్నవో వారిందు సూచించుచున్నారు. భారతీయులు సృష్టించిన విమానముకథ ప్రాతదైనను క్రొత్త విషయము. యస్వీ శ్రేష్ఠిగారు విజ్ఞానసంపన్నులై రైటుసోదరులకు ముందే విమానమును సృష్టించి నడిపి చూపియుండిరి. అప్పటి ఆంగ్లప్రభుత్వము వారి పరిశోధనకు సాయము చేయకపోవుటయుండ అనుమతి నైన నీయకుండుట శోచనీయమైన విషయము. ప్రసిద్ధ నృసింహ క్షేత్రములు, ఉందేల కవితాగాండీవ మనునవి చివరి రెండు వ్యాసములు. యాదగిరి క్షేత్రము తెలంగాణమున సుప్రసిద్ధమైన నృసింహ క్షేత్రము. దానికి సంబంధించిన విశేషము లన్నియు ఒక వ్యాసమున వ్యక్తము చేయబడినవి.

ఉందేల మాలకొండారెడ్డిగారు గొప్ప కవి. ఆయన ప్రతిభయంతయు అన్యథా ప్రసారిత మగుట ఆంధ్రకవిత్వమునకు గొప్ప లోపముగా నున్నదని నేను భావించుచున్నాను. వారు లేఖినీ గాండీవమును గ్రహించి మరల విజృంభింపవలెనని నా ఆకాంక్ష.

శ్రీ జంగయ్యగారి శైలి వచన మైనను, పద్య మైనను ధారాళమై సర్వసుబోధమై వ్యావహారికమునకు సన్నిహితముగా నుండును. వారు కొన్ని స్వతంత్ర భావములను నిర్భయముగా వెల్లడించుచుందురు. అవి పఠితలకు ఆలోచనా స్ఫోరకములై ఆనందము కలిగించుచుండును. వారు తమ అనుభవములను, జ్ఞాపకములను గ్రంథరూపమున వెలయింతుమని ఒక్కచో చెప్పియున్నారు. ఆ గ్రంథములకొరకు

చాతకములు వర్షము కొరకు వలె మన మందరమును ఎదురుచూచు చుందము.

విద్యార్థులందరు చదువదగిన మంచి వ్యాసములను రచించిన మిత్రులు శ్రీ జంగయ్యగారిని హృదయపూర్వకముగా నభినందించు చున్నాను.

ఈ వ్యాస సంపుటిని నాకు సుపరిచితులు వినయసంపన్నులు, విజ్ఞానసంపన్నులును అయిన శ్రీ సోమ రాజరాం గారికి వారంకితము చేయుట బంగారమునకు పరిమళము కల్పించినట్లున్నది.

- దివాకర్ల వేంకటావధాని

★